Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190
జీవిత చందా రూ.1000లు
సంవత్సర చందా
స్వదేశంలో రూ.200లు
విదేశాలకు రూ.1000లు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు    స్థాపితం: 1930    జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 43 • 25-10-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-

Hotel
D.S.R
Paradise
Function Hall
Fully Airconditioned
250 seating capacity
L.E.D lighting  Ample car parking
అయ్యప్పగుడి సెంటర్, నెల్లూరు.
ఫోన్: 2354888, 2308666
సెల్: 8008256888, www.dsrparadise.com

### సమైక్య శంఖారావం కాదు, తెలంగాణ ఉద్యమ ధిక్కారం

# తెలంగాణకు సవాలు విసురుతున్న జగన్!

సమైక్య శంఖారావం సభను చాలా ప్రతిష్టాత్మకంగా తీసుకొన్నాడు వైఎస్ జగన్. తన సత్తా ఏమిటో చాటడానికి ఇదొక అవకాశంగా భావిస్తున్నాడు. అందుకోసం అన్ని శక్తులూ కేంద్రీకరిస్తున్నాడు.

హైదరాబాద్ నగరంలో సమైక్యాంధ్ర పేరిట సభ జరపాలనుకోవడం ఒక సాహసం. అయితే ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఏపిఎన్జీఓ సంఘం ద్వారా ఆ సాహసం చేసి చూపించాడు. జగన్‌కు ఇప్పుడు అదే స్ఫూర్తిగా మారింది. మొదట నుంచి ఆయనకు తెలంగాణలో వునికి తక్కువ. ఓదార్పు యాత్ర కోసం వరంగల్ జిల్లా మానుకోటకు వెళ్లబోతే, తెలంగాణవాదులు రాళ్లతో కొట్టి తరిమేశారు. రైలు దిగే పరిస్థితి కూడా లేకుండా చేశారు. అప్పటి నుంచి జగన్ తెలంగాణ ప్రాంతంలో ఒక్క సభ కూడా పెట్టలేదు. అప్పట్లో ఆయనకు తెలంగాణ జిల్లాలలో పార్టీ యంత్రాంగం వుండింది. కొండా సురేఖ, మహేంద్రరెడ్డి వంటి నేతలూ వున్నారు. కానీ, వైఎస్‌ఆర్ కాంగ్రెస్ అధికారిక విధానం సమైక్యాంధ్ర కొనసాగింపు అని ప్రకటించడంతో వారంతా పార్టీ వదలి వెళ్లిపోయారు. పార్టీ వ్యవస్థ కుప్పకూలిపోయింది. దాన్ని పునర్నిర్మించుకోవడానికి ఈ సమైక్య శంఖారావం సభ ఒక అవకాశం అన్నది జగన్ భావన.

జగన్ అంచనా ప్రకారం హైదరాబాదు చుట్టుప్రక్కల జిల్లాలలోని ప్రజానీకం తెలంగాణ రాష్ట్ర విభజనకు సుముఖంగా లేదు. తెలంగాణ ఉద్యమం ఉధృతమైనప్పటి నుంచి తమ భూముల ధరలు పడిపోయాయని రంగారెడ్డి, మహబూబ్‌నగర్, నల్గొండ, మెదక్ జిల్లాల రైతులు బాధపడుతున్నారు. ఆంధ్ర నుంచి వలస వచ్చి ఇక్కడ స్థిరపడిన లక్షలాది మంది కూడా ఈ నాలుగు జిల్లాల పరిధిలోనే వున్నారు. అందువల్ల తాను హైదరాబాదులో సమైక్య అనుకూల సభ పెడితే, ఈ ప్రాంతంలోని సమైక్య వాదులందరూ లక్షల సంఖ్యలో తరలి వస్తారన్నది జగన్ అంచనా.

ఆయన సభ పెట్టింది – ఎల్‌బి స్టేడియంలో. అది చాలా చిన్న స్టేడియం. 50 నుంచి 60వేల మందికి మించి జనాన్ని అక్కడ చేర్చలేరు. ఆ సామర్ధ్యానికి సరిపడా ఆంధ్ర నుంచి జనాన్ని తరలించడానికి రైళ్లు, బస్సులు, ఇతర వాహనాలు ఏర్పాటు చేస్తున్నాడు. ఆంధ్ర ప్రాంతంలోని మొత్తం 175 నియోజకవర్గాల నుంచి తలకొక ఐదు వేల మంది లెక్కన జనాన్ని తీసుకొని రావాలని ఎమ్మెల్యే అభ్యర్థులకు ఆదేశాలిచ్చాడు. నిజంగా అంత మంది వస్తే, ఎల్‌బి స్టేడియం మాత్రమే కాదు, మొత్తం హైదరాబాద్ నగరమే క్రిక్కిరిసి పోతుంది. జగన్ ఆలోచన కూడా అదే. సభ జరిగే రోజు హైదరాబాద్ నగరం

కొరవ 14వ పేజీలో

### • జడ్పీటీసీ ఎన్నికలకు

# జెండా ఊపిన సిఎం!

### ఈ నిర్ణయంలో ఏదో తిరకాసు దాగి వుందన్నట్లుంది.

జడ్పీటిసి, ఎమ్పీటీసి ఎన్నికలు జరిపించాలని ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి నిర్ణయించినట్లు తెలుస్తున్నది. నవంబర్ మూడవ వారంలో ఎన్నికల నోటిఫికేషన్ జారీ చేయడానికి తగినట్లుగా సన్నాహాలు చేయాలని ఆయన కలెక్టర్లను ఆదేశించాడు. విచిత్రమైన పరిణామం ఇది. మూడు నెలల క్రితం గ్రామ పంచాయితీ ఎన్నికలు జరిగినప్పుడే, జడ్పీటిసి, ఎమ్పీటిసి ఎన్నికల నిర్వహణ జరిపి వుండాలి. అయితే సమైక్యాంధ్ర ఉద్యమం మొదలు కావడంతో ఆయన ప్రతిపాదన వెనక్కుపోయింది. మునిసిపల్ ఎన్నికలకు అన్ని ఏర్పాట్లు చేసి కూడా విరమించుకొన్నారు. ఇప్పుడు వున్నట్లుండి ఎన్నికల తిరునాళ్ల మొదలు పెట్టాలన్న ఆలోచన కిరణ్‌కుమార్ రెడ్డికి ఎందుకు కల్గిందన్నది పెద్ద ప్రశ్న. ఆయన రాజకీయ శైలి, వైఖరి ఏమిటి అనే విషయంలో రాజకీయ వాదులందరినీ అయోమయంలోకి నెడుతున్న ప్రశ్న ఇది.

తాను నూటికి పదహారణాల సమైక్యవాదిని అని పదే పదే ప్రకటించుకొన్నాడు కిరణ్‌కుమార్‌రెడ్డి. ఎన్జీఓల సమ్మె విరమణ తర్వాత కూడా నేను ఫైలిన్ తుఫాను ఆపలేకపోయాను కానీ, సమైక్య తుఫాను మాత్రం ఆపి తీరుతానని భీష్మ ప్రతిజ్ఞ చేశాడు. అధిష్టానం అభిమతాన్ని ధిక్కరించి తిరుగుబాటు తత్వం ప్రదర్శించాడు. ఎన్జీఓల సమ్మె కూడా ఆయన వ్యూహంలో ఒక భాగం అన్న నిజం అందరికీ తెలుసు. వారి చేత సమ్మె చేయించింది ఆయనే, విరమింప చేసింది కూడా ఆయనే. ఉద్యోగుల సమ్మె అనేది జరగకుండా వుండి వుంటే, ఆంధ్ర ప్రాంతంలో సమైక్యత మీద ప్రజలలో అంత ప్రగాఢ అభిలాష వుందన్న నిజం లోకానికి తెలిసేది కాదు. ఢిల్లీ పెద్దలు ఆంధ్ర వాదులు చెప్పే మాటలను ఆలకించేవారు కూడా కాదు. కిరణ్ పట్టుదల, మూర్ఖపు పంతం వల్లనే కేంద్రంలో రాష్ట్ర విభజన పట్ల పునరాలోచన వచ్చింది. అధిష్టానం తన మీద ఆగ్రహిస్తున్నదని తెలిసి కూడా సాహసంతో వ్యవహారం నడిపాడు.

ఈ సాహసానికి కారణం – స్వంత పార్టీ పెట్టుకోవాలన్న కోరిక అని కూడా అందరికీ అర్థమైంది. నవంబర్ మొదటి వారంలో రాష్ట్రమంతా విస్తృత పర్యటన జరిపి, ప్రజలలో సమైక్య భావనను మరింత రెచ్చ గొట్టి, ఆ ఉద్యమానికి ఛాంపియన్ నేనే అని ప్రజల చేత అన్పింప చేసుకొని, ఆ తర్వాత పార్టీ ప్రక

కొరవ 14వ పేజీలో

ఆస్కా ఎన్నికలు 27.10.2013
(ఆంధ్ర సోషల్ & కల్చరల్ అసోసియేషన్, చెన్నై)
(మధ్యాహ్నం 2 గం॥ల నుండి సాయంత్రం 8 గం॥ల వరకు)
శ్రీ వెంకటేశ్వరుని & షిర్డి సాయిబాబా
కొండంత ఆశీస్సులతో
"కార్యదర్శి"గా స్వతంత్ర అభ్యర్థినై పోటీ చేస్తున్న నన్ను
ఆదరించి మీ ఓటు వేసి, కూటమి (Panel) లో ఉన్నా, స్వతంత్ర అభ్యర్థి
అయినా అర్హుడైన వానికే తప్పక ఓటు వేస్తారని సభ్యులందరు
ఋజువు చేసి నాకు పరిపూర్ణమైన విజయాన్ని చేకూరుస్తారని ఆశిస్తూ...
మీ జె.కె.రెడ్డి, FCA
LMR 262

# సిగ్గులేని ప్రధాని

సత్యం కోసం సతిని అమ్మిన చక్రవర్తులు పాలించిన దేశం మనది. కానీ సత్యాన్ని సమాధి చేయడం కోసం సిగ్గుమాలినతనంగా వ్యవహరిస్తున్న ప్రధాని పాలిస్తున్నాడిప్పుడు.

బొగ్గు కుంభకోణం విషయంలో ప్రధాని మన్మోహన్‌సింగ్ వ్యవహరిస్తున్న తీరు చూస్తుంటే కంపరం కలుగుతున్నది. రాజకీయాల పట్లనే రోత పుదుతున్నది. బొగ్గు గనుల కేటాయింపులో అక్రమాలు జరిగాయని ప్రాథమికంగా నిర్ధారణ అయ్యింది. ఆ అక్రమాలు జరిగిన సమయంలో బొగ్గు శాఖ నిర్వహించింది మన్మోహన్‌సింగ్. ఆ ఫైళ్ల మీద సంతకాలు చేసింది ఆయనే. లక్షల కోట్ల విలువైన కుంభకోణం ఇది. కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ దాన్ని బయట పెట్టినంత వరకు ప్రభుత్వంలోని పెద్దలందరూ ఎక్కడి దొంగలక్కడనే గప్‌చుప్ అన్నట్లు వుండిపోయారు. కాగ్ నివేదిక తర్వాత సుప్రీంకోర్టు జోక్యం చేసుకొని సిబిఐ దర్యాప్తుకు ఆదేశించింది. ప్రధాని నిర్వహణలో వున్న శాఖ మీద, ఆయన సంతకాలు పెట్టిన అంశాల పైన సిబిఐ దర్యాప్తు జరగడం అన్నది దేశానికే సిగ్గు చేటైన విషయం. ఆ దర్యాప్తు ప్రారంభమైన రోజే ఆయన పదవి నుంచి తప్పుకొని వుంటే గౌరవంగా వుండేది. కానీ ఆయన ఆ పని చేయలేదు. మానాభిమానాలు వదలి పెట్టి పదవి చూరు పట్టుకొని వేలాడుతున్నాడు.

ఈ లోగా తాము దర్యాప్తు జరుపుతున్న బొగ్గు గనుల కేటాయింపులకు సంబంధించిన ఫైళ్లు మాయమైనాయని సిబిఐ సుప్రీంకోర్టుకు నివేదించింది. ప్రధాని కార్యాలయం నుంచి ఫైళ్లు మాయం కావడం ఎంత నీచమైన విషయం. దర్యాప్తులో తమ నేరాలు ఎక్కడ బయటపడతాయో అన్న భీతితోనే ఈ ఫైళ్లను మాయం చేశారని పసి పిల్లవాడికి కూడా అర్ధమైపోతుంది. దీనిపై పార్లమెంట్‌లో ప్రతిపక్షాలు పెద్ద ఎత్తున గోల చేశాయి. ప్రధానిని నిలదీశాయి. కానీ ఫలితం శూన్యం. ఏదో చెత్త వివరణ ఇచ్చి, సభ్యులను సమాధాన పరచడానికి ప్రయత్నం చేయడం తప్ప తన తప్పుకు కనీస పాటి పశ్చాత్తాపం కూడా వ్యక్తం చేయలేదు ప్రధాని.

ఇప్పుడు తాజాగా ఆనాటి బొగ్గు గనుల శాఖ కార్యదర్శి పరేఖ్ నేరుగా ప్రధాని మీద ఆరోపణ గుప్పించాడు. కుమార మంగళం బిర్లాకు జరిపిన ఒక బొగ్గు గని కేటాయింపులో అక్రమాలు జరిగాయని సిబిఐ కేసు పెట్టింది. అందులో ఆనాటి బొగ్గు గనుల శాఖ కార్యదర్శిని కూడా నిందితుడిగా చేర్చింది. పరేఖ్ చాలా పేరున్న అధికారి. నీతికి నిబద్ధతకు పేరు పొందినవాడు. ఆయన సర్వీసులో ఒకరు వేలెత్తి చూపే తప్పు చేయలేదని ప్రతీతి. అటువంటి అధికారిని సిబిఐ కేసులో ఇరికించడంతో దేశంలోని మొత్తం ఐఎఎస్ లందరూ ఏకమయ్యారు. పరేఖ్ కూడా, బొగ్గు గనుల కేటాయింపు సవ్యంగా లేదని తాను ప్రధానికి నివేదించానని, కానీ ఆయన తన సిఫార్సును పక్కనపెట్టి, కేటాయింపులకు అడ్డదారులను మతించాడని ప్రకటించాడు. ఈ కేసులో నేను నిందితుడనైతే ప్రధాని కూడా నాతోపాటు సహ నిందితుడిగా వుండాల్సిందే అని సాహసోపేత ప్రకటన చేశాడు. దానికి ఐఎఎస్ అధికారుల సంఘం మద్దతు పలికింది.

జమీన్‌రైతు

ఒక ప్రధానికి ఇంతకంటే నీచమైన, హేయమైన అవమానం వేరొకటి వుండదు. ఒక అధికారి నేరుగా తన వైపు వేలెత్తి చూపి నువ్వు అక్రమాలకు వత్తాసు పలికిన వాడివి అని నిందించినా మన్మోహన్‌సింగ్‌కు రోషం రాలేదు. సిగ్గు, లజ్జ, రోషం, పాశం అన్న పదాలకు మన్మోహన్‌సింగ్ జీవితంలో చోటు లేదేమో అన్పిస్తున్నది. ప్రపంచం మొత్తం మీద ఇంత సిగ్గులేని పాలకుడు వేరొకడు వుంటాడని భావించలేము.

వ్యక్తిగతంగా తాను నిజాయితీపరుడిని అన్న ఆత్మ విశ్వాసం ఒక్క దానితో మన్మోహన్‌సింగ్ ఇంత హేయంగా ప్రవర్తిస్తున్నాడు. పాలించే వాడు నీతిగా వుండడమే కాదు, నీతిని కాపాడే బాధ్యత కూడా తీసుకోవాలి. ఆ విషయంలో ఆయనది గర్హనీయమైన వైఫల్యం. ప్రజల దృష్టిలో నేరస్తుడిగా ముద్రపడిన తర్వాత కూడా ప్రభుత్వాన్ని వదలకుంటే ఇక ఆ ప్రభుత్వం మీద ప్రజలకు ఎటువంటి గౌరవం వుంటుంది. ఏ మాత్రం విశ్వాసం నిలుస్తుంది. దేశ చరిత్రలో దేశాన్ని ఆర్థిక కష్టాల నుంచి గట్టెక్కించిన మహనీయుడిగా నిలిచిపోవాల్సిన మన్మోహన్‌సింగ్, దేశాన్ని దోపిడీ చేసిన బందిపోట్లకు కాపలా కాసిన దేశద్రోహిగా ముద్ర వేసుకొంటున్నాడు.

## జనవాణి

### బంద్‌లతో ఇబ్బందులు!

జాతిపిత మహాత్మాగాంధీ అడుగుజాడల్లో శాంతియుతంగా ఎవరినీ ఇబ్బంది పెట్టకుండా నిరాహార దీక్షలు, మౌనవ్రతాలతో మన నిరసనలు తెలపవచ్చు. యాత్రలకు వెళ్లే వారిని ఇబ్బంది పెట్టడం, ప్రభుత్వ, ప్రైవేటు ఆస్తులు నాశనం చేయడం సరికాదు. ఈ చర్య వలన మన వస్తువులను మనం నాశనం చేసుకొన్నట్లే. పుణ్యక్షేత్రాలలో పెళ్లిళ్లు పెట్టుకొన్న వాళ్లు, శుభకార్యాలకు, సెలవులకు ఊర్లకు వెళ్లేవాళ్లు,ప్రయాణసౌకర్యాలులేక రెండు నెలలు ఇబ్బంది పడ్డారు. వయో వృద్ధులు, స్త్రీలు, పిల్లలు బంద్‌లతో ఎంతో బాధ పడ్డారు. రోగగ్రస్తులు, స్కూల్ పిల్లల గూర్చి చెప్పబని లేదు. స్వాతంత్ర్యం కోసం పోరాటం చేసిన రోజుల్లో కూడా ప్రజల నిత్య జీవితంలో ఇబ్బందులు కలుగలేదని సమైక్యాంధ్ర ఉద్యమం చేసిన, చేస్తున్న వారు గమనిస్తే మంచిది.

కె.హరినాధరావు చెన్నై

### కాంగ్రెస్ తీరు మారదా?

ఓట్లు, సీట్ల వేటలో భాగంగా తెలుగు వారిని విడదీసే దిశలో కేంద్ర ప్రభుత్వం కంకణం కట్టుకొన్నట్లుంది. తెలుగు ప్రజలు అనేక త్యాగాలుచేసి ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని సాధించుకొన్నారు. కానీ కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం ఒక ప్రాంతం వారిని ఉద్ధరించాలని తహతహలాడుతుంది. రాష్ట్రాన్ని ముక్కలు చేయాలని హడావుడిగా ఏకపక్ష తీర్మానం చేయడం సబబుగాదు. ఆది నుండి కసాయిని నమ్మిన గొర్రెలాగా కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వాల సుస్థిరతకు తెలుగు వారు పాటుపడుతున్నా పాలు పోసి పెంచినా పాము కరవక మానదన్న రీతిలో అన్ని విషయాల్లో తెలుగు వారిని నిర్లక్ష్యం చేస్తూ నిరాదరిస్తూ మూల్యాన్ని పై విధంగా తీర్చుకోవడం దారుణం. సమైక్యవాదం, సమిష్టి తెలుగు ప్రజల మంచికేనన్న సత్యాన్ని తెలుగు బిడ్డలు మనస్ఫూర్తిగా జీర్ణించుకోలేని పక్షంలో వేరు కుంపటి తప్పనిసరైతే వైషమ్యాలను ప్రక్కనపెట్టి తెలుగు బిడ్డలమంతా ఒకటే కుటుంబమనే భావనతో కలసి మెలసి మెలగేందుకు మనోబలం, గుండె నిబ్బరం ప్రసాదించమని ఆ సర్వేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

ఎన్.రామచంద్రారెడ్డి చెన్నై

### మాట మీద నిలబడని ఆనం సోదరులు!

ఆనం సోదరులు మాట మీద నిలబడే వాళ్లు కాదు. ఆనం రామనారాయణరెడ్డి, వివేకానందరెడ్డి స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కుటుంబాన్ని పలు విధాల తూలనాడారు. రాజశేఖర్‌రెడ్డి విగ్రహాన్ని గాంధీబొమ్మ సెంటర్‌లో పెట్టబోతే అడ్డుకొన్నారు. రామనారాయణరెడ్డి జగన్మోహన్‌రెడ్డిని ఉరి తీయాలన్నారు. వివేకానందరెడ్డి జగన్ శాశ్వతంగా జైల్లోనే ఉంటాడన్నాడు. ఈ విషయాలన్నీ ప్రజలకు తెలుసు. ఇప్పుడేమో జగన్మోహన్‌రెడ్డికి బెయిల్ ఇస్తే తప్పేముందని కవరింగ్

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

29-10-1943
పేజీలు:6 వెల: 0-1-6అణా

### సుందరయ్యకు సూటి ప్రశ్నలు

ది 23.10.1943 తేదిన శనివారం నాడు గుడివాడ గాంధీ చౌకులో సాయంత్రం 6 గంటలకు ఒక బహిరంగసభ జరిగింది. దానిలో సుందరయ్య గారు ఉపన్యసించుటకు గాను లేచి రష్యా దేశాన్ని దాని ప్రభుత్వ విధానాన్ని ప్రశంసిస్తూ పదినిమిషాలు మాట్లాడాడు.

యింతలో సభలో నుండి ఒకరు లేచి కొన్ని ప్రశ్నలకు సమాధానమివ్వవలసినదని సుందరయ్య గారిని కోరారు. అతడు పదిహేను ప్రశ్నలను సుందరయ్య గారి చేతికిచ్చాడు. వాటికాయన సమాధానము చెప్ప నిరాకరించాడు. సభికులంతా ఉపన్యాసకుని, ప్రశ్నలకు జవాబు యివ్వవలసినది అని కోరారు. అందుకు కూడా ఆయన అంగీకరించలేదు. దాని మీద "నీవు ప్రశ్నలకు జవాబు యివ్వకపోతే వాటిని మాకు యిచ్చెయ్యి" అని సభికులంతా కోరారు.

దానికి కూడా ఆయన అంగీకరించకుండా తగని దురుసుతనంతో తీవ్రమైన అహంకారంతో "నేనీ ప్రశ్నలకు జవాబివ్వను ప్రశ్నలను తిరిగి యిచ్చి వెయ్యను" అని చెప్పి వాటినన్నింటిని చింపి వేశాడు.

అంతట ఒక పెద్దమనిషి ఆయనను ఈ విధంగా అడిగాడు. నీవిప్పుడు, ఈ ప్రశ్నలకు జవాబివ్వకపోతే మీ 'ప్రజాశక్తి' పత్రికలోనైనా సమాధానమిస్తారా అన్నదానికి ఈ చొప్పదంటు ప్రశ్నలకు మేము జవాబిస్తామా అని సుందరయ్య గారు జవాబు యిచ్చాడు. దీంతో సభలో గోల ప్రారంభమయ్యింది.

– ఓ.వి

## 50 ఏళ్ల క్రితం ఈవారం

25-10-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ఉద్యోగి నిర్లక్ష్యం వల్ల 70వేలు నష్టం!

23తేది రాత్రి రెండు గంటల సమయంలో కొండాయపాళెం వద్దనున్న ప్రభుత్వ పరిశ్రమల శాఖ ఉత్పత్తి శిక్షణ కేంద్రంలో వడ్రంగి విభాగం అగ్ని ప్రమాదానికి లోనై, టేకు కొయ్య తదితర సామాను పూర్తిగా దగ్గమైపోయింది. షుమారు రూ 70వేలు నష్టముంటుందని అధికార అంచనా.

ఆ రాత్రి లారీలో వచ్చిన కొయ్య దించుకోవడంలో విద్యుద్దీపాలు లేనందున, ఆ ఇన్‌స్పెక్టరు స్పిరిట్‌పోసి లాంతరు వెలిగించి కొయ్యను లోపల వేయించి, తిరుగా తాళం వేసుకొనిపోయాడని; కొంత సేపటికి ఆ యింటిలో నుండి మంటలు రావడం చూసి వాచ్‌మ్యాన్ భార్య నిద్రపోతుండిన తన భర్తను లేపిందని, అతను ఏమీ చేయలేక నెల్లూరుకు పరుగెత్తి వేకువ 3.30 గంటలప్పుడు అగ్నిమాపక దళం వారికి చెప్పారని, వారు వెంటనే వి.మనోహరం ఆధ్వర్యాన పోయి దాదాపు ఐదు గంటల సేపు మంటలతో పోరాడి ఆర్పి, ప్రక్క నుండిన కమ్మరం విభాగాన్ని, స్టోరు గదిని కాపాడ గలిగారని తెలుస్తున్నది.

లేకుంటే నష్టం విపరీతంగా వుండేదట. వడ్రంగం విభాగంలో ఇనుప సామాను తప్ప, తక్కినదంతా బూడిదై పోయినదట.

ఆ ఇన్‌స్పెక్టరు నిర్లక్ష్యమే యింత పెద్ద ప్రమాదానికి కారణంగా భావిస్తున్నారు.

ఎస్పీ, ఎఎస్పీ తదితర అధికారులు ప్రమాదస్థలానికి పోయి చూచి వచ్చారు.

–మా.వి

# నెల్లూరు ముచ్చట్లు
విశ్వకుడు

## దొంగలొచ్చేస్తున్నారు!

ఈనాటికీ దొంగతనమే తమ వృత్తిగా బతుకుతున్న పలువురు కప్పరాళ్ల తిప్పలో ఉన్నారు. చాలా కొద్ది మంది తిప్ప, కావలి, నెల్లూరులలో స్థిరపడగా పలువురు కర్నాటక, మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్‌కు వెళ్లి ఈ వృత్తిని కొనసాగిస్తున్నారు. ఇతర రాష్ట్రాలలో ఉన్నవారు డిసెంబరు మొదటి వారంకల్లా కప్పరాళ్ల తిప్పకు రావడం గత కొన్నేళ్లుగా రివాజు. ఈ సమయంలో జిల్లాలో దొంగతనాలు పెరుగుతాయి. కావలి డివిజన్ పోలీసులు మరీ ముఖ్యంగా డిఎస్పీ ఇందిర కప్పరాళ్లతిప్పపై దృష్టి కేంద్రీకరించాల్సిన రోజులివి. ఎస్పీగారు మీరు కూడా ఈ విషయమై శ్రద్ధ చూపాల్సి వుంది.

## ఆదాల కలకలం

సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి సైలెంట్‌గా ఉంటారు. తన పని తానేదో చేసుకుపోతుంటాడు. అటువంటిది వెంకటాచలం మండలం అనికేపల్లి గ్రామంలో 19వ తేదీ జరిగిన సభలో వచ్చే శాసనసభ ఎన్నికల్లో ఎమ్మెల్యేగా సర్వేపల్లి నుంచి పోటీ చేస్తానో... లేదో నని చెప్పి కలకలం సృష్టించారు. కాంగ్రెస్ ప్రభుత్వంలో పనిచేయించుకున్న నాయకులు పార్టీకి వెన్నుపోటు పొడిచి వెళ్లిపోతున్నారు. అది దొంగల పార్టీ అని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీని ఉద్దేశించి వ్యాఖ్యానించారు. ఆదాల ప్రభాకర్‌రెడ్డి ఎందుకిలా మాట్లాడారంటూ అన్ని వర్గాల్లో చర్చ జరుగుతుందిప్పుడు.

ఆధునాతన గృహోపకరణాలకు చిరునామా...
AMMA FURNITURE MALL
అమ్మ ఫర్నిచర్ మాల్
సువిశాలమైన భవంతిలో కనులను మైమరపించే వందలాది డిజైన్లతో విభిన్న మాడల్స్ మీ కోసం... విచ్చేయండి.
AMMA FURNITURE MALL
మినీబైపాస్‌రోడ్డు, నెల్లూరు.
ఫోన్: 0861-2302234

## మార్చి లేదా ఏప్రెల్‌లో ఎన్నికలు!

వచ్చే ఏడాది మార్చి లేదా ఏప్రెల్ నెలల్లో సాధారణ ఎన్నికలు జరిగే అవకాశం వుందని ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి వెల్లడించారు. ఆత్మకూరులో 20వ తేదీ వివిధ శాఖాధికారులతో ఆయన సమీక్షా సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ ఫిబ్రవరి రెండవ వారంలో ఎన్నికల షెడ్యూల్ వెలువడే అవకాశం వుంది. ప్రభుత్వం చేసే అభివృద్ధి కార్యక్రమాలు ప్రజలకు ఉపయోగపడాలంటే వాటిని వేగవంతంగా పూర్తి చేయాలని జనవరి నెలాఖరుకు వీటి ఫలాలు ప్రజలకు అందించాలన్నారు.

## నెల్లూరుకు కొత్త ఆర్డీఓ!

నెల్లూరు ఆర్డీఓగా సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి 19వ తేదీ బాధ్యతలు స్వీకరించారు. కావలి ఆర్డీఓగా పనిచేస్తున్న ఈయన్ను ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి సలహామీదట ఇక్కడ నియమించారు. సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి కావలిలో రాణించారు. నెల్లూరులో ఎలా పని చేస్తారనే దానికి కొన్నాళ్లు వేచి చూడక తప్పదు.

## విపిఆర్ కన్వెన్షన్ సెంటర్‌లో అన్ని పార్టీలు!

కనుపర్తిపాడులో వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి అత్యంత ప్రతిష్టాత్మకంగా నిర్మించిన విపిఆర్ కన్వెన్షన్ సెంటర్ ప్రారంభోత్సవం సందర్భంగా 19వ తేది వెంకటేశ్వర స్వామి కళ్యాణాన్ని వైభవంగా జరిపించారు. ఈ వేడుకకు అన్ని పార్టీల నాయకులు హాజరవ్వడంతో నిండుతనం చేకూరింది. ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఆయన సోదరుడు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి, ఆనం విజయకుమార్‌రెడ్డి ఈ కార్యక్రమానికి హాజరయ్యారు. ఒంగోలు ఎమ్పీ మాగుంట శ్రీనివాసులురెడ్డి, మాజీ ఎమ్పీ మాగుంట పార్వతమ్మ, సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి, సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి తోపాటు తెలుగుదేశం ఎమ్మెల్యేలు పరసా రత్నం, బల్లి దుర్గాప్రసాద్, కురుగొండ్ల రామకృష్ణ, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకులు కాకాణి గోవర్ధన్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్ రెడ్డి, అనిల్‌కుమార్ యాదవ్ హాజరయ్యి వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి అందరివాడని చాటి చెప్పారు.

## వర్షం

బంగాళాఖాతంలో అల్పపీడనం ఏర్పడిన మూలంగా 20వ తేది సాయంత్రం నెల్లూరులో మొదలైన వర్షం 23వ తేది వరకు కురుస్తూనే వుండింది. ఈ వర్షానికే నగరంలోని రోడ్లపై నీరు చేరిపోయింది. సండే మార్కెట్‌లో వరదొచ్చిన వాగు ప్రవాహాన్ని ఈ వర్షపు నీళ్లు తలపించాయి. 21, 22 తేదీల్లో నెల్లూరులో 12 సెంటీమీటర్ల వర్షం నమోదయ్యింది.

### చందాదారులకు మనవి

- ☞ చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- ☞ మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- ☞ 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Online‌లో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- ☞ చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**
స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## మళ్లీ మెరుపు సమ్మె!

సమైక్యాంధ్ర రాష్ట్ర సాధన కోసం తలపెట్టిన సుదీర్ఘ సమ్మె విరమణ తాత్కాలికమేనని జిల్లా గెజిటెడ్ అధికారుల సంఘం జెఎసి ఛైర్మన్ డిఆర్వో బి.రామిరెడ్డి చెప్పారు. ఉద్యోగులు సమైక్యాంధ్ర ఉద్యమాన్ని నిరంతరం కొనసాగిస్తారు. రాష్ట్రాన్ని ముక్కలు చేస్తున్నట్లు కేంద్రం నుంచి మరో ప్రకటన వస్తే తాము మళ్లీ మెరుపు సమ్మెకు దిగుతామన్నారు. 66 రోజుల సుదీర్ఘకాలం విధులకు దూరమై జీతాలు లేక పస్తులుంటూ కూడా సమ్మెను విజయవంతం చేసిన అధికారులు, ఉద్యోగులు, రెవిన్యూ సిబ్బందికి ఆయన కృతజ్ఞతలు చెల్లించారు.



నెల్లూరులో జరిగిన బ్రాహ్మణ సేవా సంఘాల సమాఖ్య సర్వ సభ్య సమావేశంలో మాట్లాడుతున్న రాళ్లపల్లి రామసుబ్బారావు.

## బ్యాంకులకు నష్టం రూ.300 కోట్లు!

సమైక్యాంధ్ర ఉద్యమం మూలంగా జిల్లాలోని బ్యాంకులు పదిరోజులకు పైగా మూతబడ్డాయి. దీనిమూలంగా 300 కోట్ల రూపాయల లావాదేవీలు జరగకుండా ఆగిపోయి బ్యాంకులు నష్టపోవడం విశేషం.

## సిఐ రాజశేఖర్‌రెడ్డిలో మార్పు!

నెల్లూరు ఐదవ పట్టణ సిఐ రాజశేఖర్‌రెడ్డి నగర సిఐగా పనిచేసిన రోజుల్లో సౌమ్యునిగా పేరుపొందాడు. కానీ ఈ మధ్య ఆయన ధోరణి మారినట్లుంది. 21వతేదీ గోల్డన్ జూబ్లీ హాల్‌లో జరిగిన ఐఎబి సమావేశం వద్దకు నిరసన తెలియజేయను వచ్చిన తెలుగుదేశం జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్రను దురుసుగా తోసివేయడం చర్చనీయాంశమయ్యింది. పక్షం రోజుల క్రితం విద్యుత్ భవన్ వద్ద చిన్న గొడవ పెద్దది కావడానికి రాజశేఖర్‌రెడ్డి కారకులయ్యారు. దీంతో రాష్ట్రవ్యాపిత విద్యుత్ సమ్మెకు కార్మికులు పిలుపునిచ్చారు. వాస్తవంగా నగరంలో పనిచేసే సర్కిల్ ఇన్‌స్పెక్టర్లలో అనుభవపరుడు, అన్నీ తెలిసిన వ్యక్తి రాజశేఖర్‌రెడ్డి. నగరంలో గందరగోళ సమయాల్లో ఆయన సంయమనం కోల్పోకుంటే బాగుంటుంది.

## రాష్ట్ర ఎన్నికల కమిషనర్!

రాష్ట్ర ఎన్నికల కమిషనర్ భన్వర్‌లాల్ కాళహస్తి నుంచి 20వ తేది సాయంత్రం నెల్లూరు వచ్చారు. మైపాడు బీచ్‌లో కుటుంబసమేతంగా సేదదీరిన ఆయన 21వ తేది నెల్లూరు పినాకిని అతిథి గృహంలో కలెక్టర్, జాయింట్ కలెక్టర్‌లతో జిల్లాలో ఓటర్ల నమోదుపై సమీక్షా సమావేశం జరిపారు. నెల్లూరు సిటీ, రూరల్ నియోజకవర్గాలలో ఓటర్ల జాబితాలపై రివిజన్ చేయమని ఈ సందర్భంగా జిల్లా అధికారులను ఆదేశించారాయన.

## కేంద్ర క్యాబినెట్‌కు లేదు!

రాష్ట్రాన్ని విభజించే హక్కు కేంద్ర క్యాబినెట్‌కు లేదని, శాసనసభ అనుమతితోనే విభజన బిల్లు పార్లమెంటుకు వెళ్లాలని తెలుగుదేశం పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి స్పష్టం చేశారు. ఒకవేళ కేంద్రం కప్పదాట్లకు పాల్పడితే ఈ వ్యవహారమై న్యాయస్థానాలను ఆశ్రయిస్తామని చంద్రమోహన్‌రెడ్డి స్పష్టం చేశారు.

## వైకాపాలో పసల!

మాజీ మంత్రి పసల పెంచలయ్య
కొరవ 14వ పేజీలో

వజ్రం - బంగారం - వెండి
ఫ్యాక్టరి అవుట్‌లెట్
BIS 916 హాల్‌మార్క్
బంగారు ఆభరణములపై*
తరుగు 6% నుండి - కూలి లేదు.
వెండి వస్తువులపై*
తరుగులేదు - కూలిలేదు.
డైమండ్స్ పై 10% తగ్గింపు*
*T&C Apply
గోల్డ్ ప్యాలెస్
ఆచారివీధి, హోటల్ శివం ఎదురుగా,
జిల్లా పరిషత్ ఆఫీస్ సెంటర్, నెల్లూరు.
ఫోన్: 2331133, 2327611

సిల్వర్ ఫ్యాక్టరి అవుట్‌లెట్
925 STERLING SILVER*
EXPORT QUALITY
వెండి వస్తువులపై*
తరుగు లేదు, కూలి లేదు.
*T&C Apply
సిల్వర్ ప్లాజా
EXCLUSIVE SILVER SHOW ROOM
(A Unit of Gold Palace)
ఆచారివీధి, హోటల్ శివం ఎదురుగా,
జిల్లా పరిషత్ ఆఫీస్ సెంటర్, నెల్లూరు.
ఫోన్: 2331132, 2331121

ఓం శ్రీ
నాగలక్ష్మి గ్రీన్ సిటీ
నెల్లూరు.
Kancharla Developers
Office : Near Children's Park
Beside Saibaba Temple Street
Chinthareddypalem Road, Nellore
9963 479 199, 9963 479 299, 9963 479 899
Site: Rangacharya Kandriga,
Kakupalli Bit-II Village, Madaraju Gudur(G.P.)
Nellore Mandal, Nellore District.

HOUSE FOR RENT
Independent Duplex Bunglow with 5400 sq.ft living area containg 4 Bed Rooms. Servants Quarter, Car Parking, Lawn etc., Centrally located at D.No.23-3-336, Tekkemitta. Beside Chiranjeevi Apartment, Nellore-3 is readily available for rent.
for Residence / Office / Guest House.
For Details : 09842 34556

# ప్రజల సొత్తు హైరర్స్ పాలు!

● నెల్లూరు కార్పొరేషన్‌లో గడచిన ఐదేళ్లలో రూ.12 కోట్లు చెల్లించారు.



బక్రీదు వేడుకల్లో వేసిన ఈ షామియానాలకు 8లక్షలు చెల్లించారు.

నెల్లూరు కార్పొరేషన్‌లో ఎంతో విలువైన ప్రజాధనం దుర్వినియోగమవుతుంది. కార్పొరేషన్ నేతృత్వంలో రంజాన్, బక్రీద్, రొట్టెల పండుగ, గాలిపటాల పండుగ, గొబ్బెమ్మల పండుగలను పురస్కరించుకొని బారాషహీద్ దర్గా, ఈద్గాలు, పెన్నానదిలో వివిధ ఏర్పాట్లు చేసేందుకు నగరంలోని ఒక హైరర్స్ నిర్వాహకునికి 12 కోట్ల రూపాయలు ఈ ఐదేళ్లలో బిల్లుల రూపంలో చెల్లించడం చర్చనీయాంశమయ్యింది. ఇంత మొత్తం ఒకే ఒక హైరర్స్‌కు చెల్లించడం వెనుక గూడుపుఠాణీ కూడా జరిగింది. ముస్లింల పండుగ సమయాల్లో బారాషహీద్ దర్గా దగ్గర వున్న ఈద్గా వద్ద షామియానాలు, కార్పెట్లు, నీళ్ల డ్రమ్ముల వంటివి ఏర్పాటు చేస్తారు. దర్గా వద్ద ఈద్గా స్థలం 500 అంకణాలుండవచ్చు. కానీ లక్షా 20వేల చదరపు అడుగుల్లో షామియానాలు వేసినట్లు, కార్పెట్లు పరచినట్లు బిల్లుల్లో పేర్కొంటారు. మొన్న బక్రీద్ పండుగ నాడు ఈద్గా వద్ద ఏర్పాట్లకు సెప్టెంబర్ 26వ తేది విజయశంకర్ అనే వ్యక్తి పేరిట టెండర్ వేయడం దాన్ని ఈ నెల 10వ తేది ఆన్‌లైన్‌లో తెరచినట్లు బ్రహ్మాండమైన మాయాజాలాన్ని కార్పొరేషన్ అధికారులు సృష్టించారు. టెండర్‌లో పేర్కొన్న వ్యక్తి హైరర్స్ నిర్వాహకుని బినామీగా అందరికీ సుపరిచితుడు. ఎప్పుడూ హైరర్స్ సంబంధిత పనులకు ఇతనే ఆన్‌లైన్ టెండర్లు దాఖలు చేస్తుంటాడట. డాక్టర్ ఆంజనేయులు కమిషనర్‌గా ఉండింది మొదలు శ్యాంసన్ గారి కమిషనర్‌గిరి వరకు ఈ హైరర్స్ నిర్వాహకునికి అక్షరాల 12 కోట్ల రూపాయలు చెల్లించారంటే కార్పొరేషన్‌లో ప్రజాధనాన్ని ద్రవంవలే ఏవిధంగా దుర్వినియోగం చేస్తున్నారో అర్థం చేసుకోవచ్చు. కార్పొరేషన్‌లో హైరర్స్ నిర్వాహకునికి చేసిన చెల్లింపులపై విజిలెన్స్ విచారణకు ఆదేశిస్తే లోగుట్టు మొత్తం బయటపడడం ఖాయం.

# అనిల్‌కుమార్ నేతృత్వంలో ఆటో ర్యాలీ!

● సమైక్యాంధ్రకు మద్దతుగా ప్రదర్శన!



ఆటో ర్యాలీలో మాట్లాడుతున్న అనిల్‌కుమార్ యాదవ్.

సమైక్యాంధ్రకు మద్దతుగా వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ పిలుపు మేరకు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నెల్లూరు నగర అసెంబ్లీ నియోజకవర్గ సమన్వయకర్త డాక్టర్ పి.అనిల్‌కుమార్ యాదవ్ నేతృత్వంలో భారీ ఆటో ర్యాలీ నిర్వహించారు. ఈ ఆటో ర్యాలీ గాంధీబొమ్మ సెంటర్ నుండి ప్రారంభమై విఆర్‌సి, గాంధీబొమ్మ, కనకమహల్ సెంటర్, బోసుబొమ్మ, ఆత్మకూరు బస్టాండ్, మినీ బైపాస్ రోడ్డు మీదుగా రామలింగాపురం సర్కిల్ నుంచి రాజన్న భవన్ వరకు జరిగింది. ఈ సందర్భంగా డాక్టర్ అనిల్‌కుమార్ యాదవ్ మాట్లాడుతూ రాష్ట్రంలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సమైక్యాంధ్ర కోసం పోరాడుతుంటే ప్రధాన ప్రతిపక్షమైన తెలుగుదేశం పార్టీ నాయకుడు చంద్రబాబునాయుడు రెండు కళ్ల సిద్ధాంతాన్ని అవలంభిస్తూ ఢిల్లీలో దొంగ దీక్షలు చేశాడు. ఈ రాష్ట్రం విడిపోతుందని స్పష్టంగా తెలుస్తున్నప్పటికీ ఎన్జీఓలు, విద్యార్థులు, ప్రజలు సైతం కేంద్ర మంత్రులు రాజీనామా చేస్తేనే రాజకీయ సంక్షోభం ఏర్పడి రాష్ట్రం సమైక్యంగా ఉండే అవకాశం వుందని చెబుతున్నప్పటికీ కేంద్ర మంత్రులు, ఎమ్పీలు దొంగ నాటకాలు ఆడుతున్నారని విమర్శించారు. వైకాపా తరపున ఈ నెల 25వ తేది హైదరాబాద్‌లో జరిగే సమైక్య శంఖారావ సభకు వేలాదిగా నెల్లూరీయులు తరలిరావాలని అనిల్‌కుమార్ యాదవ్ పిలుపునిచ్చారు.

# దొంగతనాలు అదుపులోకి వచ్చాయి!

## ఎస్పీ వెల్లడి



దొంగతనాల నివారణకు ప్రత్యేక చర్యలు చేపట్టడంతో దొంగతనాలు కొంతమేర తగ్గుముఖం పట్టాయని జిల్లా ఎస్పీ రామకృష్ణ తెలిపారు. బైక్‌లపై సంచరిస్తూ చైన్‌స్నాచింగ్‌లకు పాల్పడడం, రెక్కీ నిర్వహించి ఇళ్లలో దొంగతనాలకు పాల్పడుతున్నారన్న సమాచారం ఉండడంతో వాహనాల తనిఖీలను ముమ్మరం చేశామన్నారు. ఇది మంచి ఫలితాలనిచ్చిందన్నారు. అనుమానాస్పద వ్యక్తులను, పత్రాలు సరిగాలేని వాహనాలను పట్టుకొని విచారిస్తున్నట్లు తెలిపారు. జిల్లాలో జరుగుతున్న దొంగతనాలు, వాటిని అరికట్టేందుకు తీసుకొంటున్న చర్యలపై విలేకరులతో మాట్లాడారు. జిల్లావ్యాప్తంగా పలు ప్రాంతాల్లో జరుగుతున్న దొంగతనాలను అరికట్టేందుకు, దొంగలను పట్టుకొనేందుకు సిసిఎస్ పోలీసులు, స్థానిక పోలీసులతో ప్రత్యేక బృందాలను ఏర్పాటు చేశామన్నారు. ఈ బృందాలు నిఘా పెట్టాయని, ఇప్పటికే కొంతమందిని అదుపులోకి తీసుకొని విచారిస్తున్నాయన్నారు. అంతర్‌రాష్ట్ర గజదొంగలను ఇద్దరిని ఈ విధంగానే పట్టుకొని నగదు స్వాధీనం చేసుకొన్నామన్నారు. ఆలయాల్లోనూ ఇటీవలకాలంలో దొంగతనాలు అధికమయ్యాయన్నారు. దీనిపైనా ప్రత్యేక దృష్టి సారించినట్లు తెలిపారు. ఆలయాల వద్ద భద్రతను కట్టుదిట్టం చేశామన్నారు. నిర్వాహకులు గుళ్ల వద్ద వాచ్‌మెన్‌లను ఏర్పాటు చేసుకోవాలన్నారు. అలాగే అపార్ట్‌మెంట్లు, వాణిజ్య సముదాయాలు, ఇతరత్రా భవనాల వద్ద వాచ్‌మెన్‌లతోపాటు సిసి కెమెరాలను ఏర్పాటు చేసుకోవాలని సూచించారు. దీని వలన నేరం జరిగితే నిందితులను పట్టుకొనేందుకు అవకాశం వుంటుందన్నారు. మహిళలు రోడ్డుపై వెళ్లేటప్పుడు తగిన జాగ్రత్తలు తీసుకోవాలని, ఆభరణాలను ధరించకపోవడం ఉత్తమమని సలహా ఇచ్చారు.

# ఎల్లలు దాటిన నెల్లూరు శాస్త్రవేత్త ప్రతిభ!

● డాక్టర్ జగదీష్ బ్లాగు అమెరికాలో పాపులర్



నెల్లూరు నుండి శాస్త్రవేత్త అనగానే గుర్తుకొచ్చే పేరు డాక్టర్ ఎ.జగదీష్‌ది. గత 40 ఏళ్లుగా ప్రత్యామ్నాయ ఇంధన వనరులు, వాతావరణం, అప్రోపియేట్ టెక్నాలజీలలో విశేష కృషి చేస్తున్న ఈ శాస్త్రవేత్తకు లభిస్తున్న అంతర్జాతీయ ప్రాచుర్యం చూస్తే ఆశ్చర్యమేస్తుంది. చాలామంది విదేశాలకు వెళ్లి అక్కడ పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తున్నారు. డాక్టర్ ఎ.జగదీష్ ఇందుకు భిన్నంగా పుట్టినూరు నెల్లూరును వదలకుండా అమెరికా వంటి అగ్రరాజ్యాలలో ఎనలేని కీర్తి ప్రతిష్టలు సంపాదించడం విశేషం. డాక్టర్ జగదీష్ ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్త ప్రొఫెసర్ వై.నాయుడమ్మ శిష్యుడు. నెల్లూరులో తన గురువు పేరిట నాయుడమ్మ సెంటర్ ఫర్ డెవలప్‌మెంట్ ఆల్టర్నేటివ్స్‌ను 1994లో స్థాపించారు. ఈ సంస్థ పేరుతోనే dr.jagadeeshmcda.blogspot.com బ్లాగ్‌ను నిర్వహిస్తున్నారు. ఈ బ్లాగులో డాక్టర్ ఎ.జగదీష్ వివిధ సాంకేతిక, వైజ్ఞానిక పత్రికల్లో ప్రచురించిన వ్యాసాలు, కామెంట్లు వెలువడుతాయి. ఈ బ్లాగు ఇండియా కంటే అమెరికాలో పాపులర్ కావడం విశేషం. ఈ బ్లాగు చదివిన వారి వివరాలు అమెరికా, ఇండియా ఇతర దేశాలతో పోలిస్తే ఇలా ఉన్నాయి. అమెరికాలో 21,658 మంది, ఇండియాలో 19,661, జర్మనీలో 4,443, ఇంగ్లాండు 3,711, ఫ్రాన్స్‌లో 2,181, రష్యా 1,469, కెనడాలో 560, తాత్వియాలో 415, నెదర్లాండ్‌లో 406 మొత్తం 74,563 మంది డాక్టర్ జగదీష్ బ్లాగ్‌లో ఈ యేడాది చదవడం విశేషం. ప్రస్తుతం పాపులర్‌గా నున్న సోషల్ నెట్‌వర్క్ ఫేస్‌బుక్, గూగుల్‌లో డాక్టర్ జగదీష్ వివరాలు, వ్యాసాలు వేల సంఖ్యలో లభ్యమవుతాయి. మరి ఇంతటి గౌరవం, గుర్తింపు లభించిన విశిష్ట వ్యక్తికి ఇసుమంతైనా గర్వం లేదు. ట్రంకురోడ్డులో సాదాసీదాగా కాలినడకన తిరుగుతుంటాడాయన. తన నాలుగు దశాబ్దాల పరిశోధనలతో సామాన్య మానవునికి సాంకేతిక వైజ్ఞానిక విజ్ఞానం చేరువవ్వాలనే ఆకాంక్ష తప్ప ఆ శాస్త్రవేత్తలో మరో కోరిక లేకపోవడం ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

# నిరాశలో ఆశావహులు!

● మునిసిపల్ ఎన్నికలు జరగకపోవడంపై బెంగ

రాజకీయాల్లో వుండే వాళ్లకు ఏదో ఒక పదవి కావాలి. ఆ పదవి కోసం ఎంతో తహతహలాడుతుంటారు. ఎన్ని ఫీట్లైనా చేస్తారు. అందులోను మునిసిపల్ రాజకీయాలు మరింత రంజుగా వుంటాయి. కార్పొరేటర్లుగా, కౌన్సిలర్లుగా పోటీ చేయాలని, ఎన్నిక కావాలని పలువురు ఉబలాటపడుతుంటారు. కానీ అలాంటి ఆశావహుల ఆశలు అడియాసలవుతున్నాయి. రాష్ట్రంలో ఏర్పడే అనిశ్చిత స్థితి, రాష్ట్ర విభజన ప్రకటనతో సీమాంధ్రలో ఉవ్వెత్తున ఎగసి పడుతున్న ఉద్యమం కారణాలతో మునిసిపల్ ఎన్నికలు ప్రక్కకు పోయాయి. ఏడాది క్రిందటే ఈ ఎన్నికలను నిర్వహించాల్సి వున్నప్పటికీ అవి వాయిదా పడుతూ వచ్చాయి. ఇప్పుడు తాజాగా రాష్ట్రంలో చోటుచేసుకున్న పరిణామాలతో మునిసిపల్ ఎన్నికలు ఎప్పుడు వుంటాయోనన్నది సందేహాస్పదమైంది. ఇక మున్సిపాల్టీలు, కార్పొరేషన్‌లలో కౌన్సిలర్లు, కార్పొరేటర్లుగా పోటీచేయాలని చాలాకాలం నుంచి ఎదురు చూస్తున్న వారితోపాటు తాజా మాజీ కార్పొరేటర్లు, కౌన్సిలర్లు దిక్కుతోచని స్థితిలో పడిపోయారు. వార్డుల విభజన, మారిన రిజర్వేషన్లతో ప్రస్తుత వార్డులు, డివిజన్లలో ప్రాతినిధ్యం వహిస్తూ మాజీలైన కార్పొరేటర్లు కొత్త వార్డులు చూసుకుని ఈసారి ఎన్నికల్లో పోటీచేసేందుకు అన్ని రకాలుగా ఏర్పాట్లు చేసుకొంటున్నారు. కొందరు కాంగ్రెస్ కార్పొరేటర్లైతే రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి మీద కోపం వున్నా అది బయటకు వ్యక్తం చేస్తే తమపై కక్ష సాధింపు చర్యలకు దిగుతాడని భయపడి గమ్మునుండిన వారంతా వైకాపా తరపున పోటీకి ఆ పార్టీ నేతలతో లోపాయికారి ఒప్పందాలు చేసుకొంటున్నారు. అలాంటి వారందరూ మునిసిపల్ ఎన్నికలు ఇప్పుడప్పుడే వుండవన్న నిర్ణయానికి వచ్చి దిగులుపడిపోయారు.

# ఆదర్శప్రాయుడు వివేకానందుడు!

## జయంతి సభలో నటుడు రఘునాథ్‌రెడ్డి



వల్ల కవి వేంకట సుబ్బయ్యను సన్మానిస్తున్న నటుడు రఘునాథరెడ్డి.

పినాకిని యూత్ వెల్ఫేర్ అసోసియేషన్ ఆధ్వర్యంలో నెల్లూరులోని టౌన్‌హాల్‌లో స్వామి వివేకానంద 150వ జయంతి వేడుకలు ఘనంగా జరిగాయి. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన సినీ నటుడు రఘునాథరెడ్డి మాట్లాడుతూ 150 ఏళ్ల క్రితం జన్మించిన వ్యక్తి గూర్చి ఈ రోజు మనం చర్చించుకొంటున్నామంటే ఆయన చేసిన ఆలోచనలే కారణమన్నారు. సినీ దర్శకుడు కెవిరమణ మాట్లాడుతూ సాహిత్యానికి కళాకారునికి చాలా దగ్గర సంబంధముందని కళ అనేది మన సాంప్రదాయాలలో ఒక భాగమని వివరించారు. ఈ సందర్భంగా నట జీవిత స్వర్ణోత్సవం పూర్తి చేసిన నట భాస్కరుడు వల్ల కవి వేంకటసుబ్బారావును ప్రత్యేకంగా సన్మానించారు. యూత్ వెల్ఫేర్ అసోసియేషన్ అధ్యక్షుడు కె.మురళీమోహన్‌రాజు, వొమ్మిన నాగసతీష్, గోగులపల్లి రవి, ఊరుబిండి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

# నేను సమైక్యవాదినే!

## కావలిలో గట్టిగా చెప్పిన బీద మస్తాన్‌రావు



సమైక్యాంధ్రకే తాను కట్టుబడి వున్నానని కావలి శాసన సభ్యుడు బీద మస్తాన్‌రావు స్పష్టం చేశారు. సమైక్యాంధ్ర ఉద్యమంలో పాలుపంచు కొన్నానని, ఎవరూ చేయని విధంగా తుమ్మలపెంట వద్ద సముద్రంలో 370 బోట్లతో మత్స్యకారులతో కలిసి జల దీక్ష చేపట్టానన్నారు. అయితే తాను కన్పించడం లేదని న్యాయవాదులు పోలీసులకు ఫిర్యాదునివ్వడం హాస్యాస్పదమన్నారు. విదేశాలకు వెళ్లి వచ్చిన తర్వాత కావలిలో విలేకరులతో మాట్లాడిన ఆయన పలు అంశాలను ప్రస్తావించారు. కొద్ది రోజులు విదేశాలకు వెళ్లడం వల్ల సమైక్యాంధ్ర ఉద్యమ కార్యక్రమాల్లో పాల్గొనలేక పోయానన్నారు. ఇది తెలుసుకోకుండా తనపై విమర్శలు చేయడం బాధాకరమన్నారు. అమెరికా పర్యటనలోనూ అక్కడ తెలుగువారికి సీమాంధ్రలో జరుగుతున్న ఉద్యమం గురించి తెలియపరచానన్నారు. అక్కడివారూ తెలుగు వారంతా ఒకే రాష్ట్రంగా వుండాలని కోరుకొంటున్నారని చెప్పారు. ఉవ్వెత్తున ఎగిసిన సమైక్యాంధ్ర ఉద్యమం వున్నట్లుండి నీరుగారిపోవడం బాధాకరమన్నారు. ఈ ఉద్యమం ఎవరి కన్నుసన్నల్లో జరిగిందో, ఎందుకు చల్లారిపోయిందో ప్రజలందరికీ తెలుసన్నారు.

# విధులకు హాజరైన టీచర్ల పరిస్థితి ఏమిటి?

**● ఎస్‌జిటిలు, స్కూల్ అసిస్టెంట్లల్లో సందేహం**

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును నిరసిస్తూ పలు ఉపాధ్యాయ సంఘాలు సమ్మె చేపట్టడం, ఆ తర్వాత విరమించడం తెలిసిందే. అయితే సమ్మెలో పాల్గొనకుండా కొందరు ఉపాధ్యాయులు విధులకు హాజరయ్యారు. జిల్లావ్యాప్తంగా 4174 పాఠశాలలు మూతపడ్డా, వివిధ మండలాల పరిధిలో ఒకటి రెండు స్కూళ్లలో, కొందరు ఉపాధ్యాయులు బడులకు వెళ్లారు. వీరి సంఖ్య స్వల్పంగా వున్నా సమ్మెలో పాల్గొనకుండా పాఠశాలకు వెళ్లారు. 2012 డిఎస్సీలో ఉద్యోగాలు పొందిన ఎస్‌జిటిలు, స్కూలు అసిస్టెంట్లు వీరిలో అధికంగా వున్నారు. చాలా మందికి ఉపాధ్యాయులు పాఠశాలలకు వెళ్లారనేది తెలియనప్పటికీ ఇది నగ్న సత్యం. ఈ పరిస్థితుల్లో సెలవు దినాల్లోనూ ఉపాధ్యాయులు పాఠశాలలకు వెళ్లాలని విద్యాశాఖ అధికారులు చేస్తున్న ప్రకటనతో గందరగోళం నెలకొనింది. తాము సమ్మెలో పాల్గొనకుండా విధులకు హాజరయ్యామని, కానీ అందరూ సెలవు రోజుల్లో పాఠశాలలు తెరవాలని, విద్యార్థులకు తరగతులు చెప్పాలంటూ అధికారులు ఆదేశిస్తున్నారని వాపోతున్నారు. దీనికి తోడు అధికారుల వెటకారపు మాటలు పుండు మీద కారం చల్లినట్లున్నాయని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. విధిగా పాఠశాలకు హాజరైన తమ పట్ల విద్యాశాఖాధికారులు వ్యంగ్యపు వ్యాఖ్యానాలు చేయడం పట్ల తీవ్రంగా స్పందిస్తున్నారు.

## ● విష జ్వరాలలో

# నెల్లూరుది మూడవస్థానం!

**● జనాన్ని జాగ్రత్తపడమన్న జిల్లా మలేరియా నియంత్రణ అధికారి**

రాష్ట్రంలో జ్వరాల బారినపడుతున్న జిల్లాల్లో నెల్లూరుజిల్లా మూడవ స్థానంలో వుందని జిల్లా మలేరియా నియంత్రణ అధికారి ఎం. వేణుగోపాల్ తెలిపారు. ఉదయగిరి నియోజకవర్గ పరిధిలోగల సీతారాంపురం తదితర మండలాల్లో విషజ్వరాలు విజృంభిస్తుండడం, పలువురు ప్రజలు అనారోగ్యానికి గురౌతుండడంతో ఆయన ఆయా ప్రాంతాల్లో పర్యటించి జ్వరాలతో బాధపడుతున్న రోగులను, వారికి అందుతున్న వైద్య సేవలను తెలుసుకొన్నారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ జిల్లాలో ఎక్కువగా మలేరియా, చికున్‌గున్యా జ్వరాలు నమోదవుతున్నాయన్నారు. విష జ్వరాలు ప్రబలడానికి ప్రధాన కారణం పారిశుధ్యం క్షీణించడమేనని అన్నారు. చెత్త తొలగించకపోవడం, దోమల పెరుగుదల, మురుగునీరు నిలబడి పోవడం వంటి వాటి వల్ల, కలుషిత నీటి వల్ల అనారోగ్యం బారినపడడం, జ్వరాల బారిన పడడం లాంటివి అధికంగా వుంటాయన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని ప్రతి ఒక్కరూ పారిశుధ్యం విషయంలో తగిన జాగ్రత్త వహించాలన్నారు. ఎవరో వస్తారు ఏదో చేస్తారని ఇతరులపై ఆధారపడకుండా ఎవరికి వారు పరిశుభ్రత పాటించాలని, పరిసరాలను శుభ్రంగా వుంచుకోవాలన్నారు. ఇళ్లలో నీరు ఎక్కువ రోజులు నిల్వ వుంచకుండా జాగ్రత్త వహించాలన్నారు. అలాగే మురుగు ప్రాంతాల్లో ఆయిల్‌బాల్స్ వేయాలన్నారు.




పోలీసు అమరవీరుల సంస్మరణ దినం అక్టోబర్ 21

మీ త్యాగం అనన్యం, మీరు చూపిన మార్గం అజరామరం
ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం, మాతృభూమి శ్రేయస్సుకోసం
కర్తవ్య దీక్షలో అసువులు బాసిన అమర పోలీసు వీరుల్లారా!
మీకిదే మా అశ్రునయన భాష్పాంజలి... హృదయపూర్వక పుష్పాంజలి

త్యాగమూర్తులను స్మరించుకొందాం - అమర పోలీసు వీరులకు నివాళులర్పిద్దాం!

ప్రకటన


పి.వి.ఎస్.రామకృష్ణ IPS
Superintendent of Police
నెల్లూరు జిల్లా.


ఐ.ఆర్.ఎస్.మూర్తి
Addl Superintendent of Police
నెల్లూరు జిల్లా.


పి.బాలవెంకటేశ్వర్లు
Deputy Superintendent of Police
నెల్లూరు రూరల్.


పి.సాంబశివరావు
Circle Inspector
బుచ్చి


కె.శ్రీనివాసరావు
Sub Inspector
బుచ్చి


జి.గంగాధర్
Sub Inspector
సంగం


ఎన్.సుబ్బారావు
Sub Inspector
దగదర్తి

● పనిచేయడం ఇష్టంలేకపోతే...

# రాజీనామాలు చేసి వెళ్లిపోండి!

ప్రభుత్వ వైద్యులు, సిబ్బంది పని చేసేందుకు ఇష్టపడక పోతే రాజీనామా చేసి వెళ్లిపోవాలని జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ సుధాకర్ తీవ్ర హెచ్చరికలు జారీ చేశారు. వివిధ ఆరోగ్య కేంద్రాల్లో సిబ్బంది పని తీరుపై ప్రజలు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారని, ఫిర్యాదులు వెల్లువెత్తుతు

**వైద్య ఆరోగ్య సిబ్బందికి డిఎంఅండ్‌హెచ్‌ఓ సూచన**

న్నందున ఈ మాట చెప్పున్నానన్నారు. వైద్య వృత్తి పవిత్రమైన దని, వేలాది రూపాయలు ప్రభుత్వం నుంచి జీతం తీసుకొంటూ సక్రమంగా పనిచేయకపోతే సహించేది లేదన్నారు. ఇటీవల ఆయన ఉదయగిరి నియోజకవర్గ పరిధిలోగల పలు ఆరోగ్య కేంద్రాలను తనిఖీ చేశారు. ఆరోగ్య కేంద్రాలలో రోగులకు అందుతున్న సేవల గురించి ఆరా తీశారు. కాన్పుల కోసం వచ్చే వారి వద్ద నుంచి సిబ్బంది అక్రమ వసూళ్లకు పాల్పడుతున్నట్లు వచ్చిన ఫిర్యాదులపై విచారించారు. ప్రభుత్వ ఆస్పత్రుల్లో వైద్యం కోసం వచ్చేవారి నుంచి డబ్బులు వసూలు చేయడం సిగ్గుచేటన్నారు. వేలాది రూపాయలు జీతం తీసుకొంటూ మళ్లీ లంచాలకు కక్కుర్తి పడుతున్నారంటే అసలు మీరు మనుషులేనా అని తీవ్ర స్వరంతో ప్రశ్నించడంతో సిబ్బంది జవాబు చెప్పలేక నీళ్లు నమిలారు. మీలో ఎవరు ఆ పని చేస్తున్నారని అడగడంతో వైద్యులు, సిబ్బంది కిక్కురు మనకుండా వుండిపోయారు. ఈ సమయంలో క్లస్టర్ అధికారి, డాక్టర్ ఒకరినొకరు డిఎంహెచ్‌ఓ ఎదుటే గొడవ పడడం ఆయన్ను విస్మయానికి గురి చేసింది.


వరిగొండలోని జ్వాలాముఖి అమ్మవారి దేవస్థానంలో ముఖ ద్వారానికి భూమి పూజ చేసి శిలాఫలకాన్ని ఆవిష్కరిస్తున్న జిల్లా కలెక్టర్ శ్రీకాంత్. ప్రక్కన సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి, ఆలయ ఛైర్మన్ సోమన శ్రీనివాసులురెడ్డి వున్నారు.

# ఇసుక టిప్పర్లతో రోడ్లు తీన్నారు!

● **తోటపల్లిగూడూరులో ఇదీ పరిస్థితి**

అధిక లోడుతో వెళ్లే వాహనాల ధాటికి తోటపల్లిగూడూరు మండలంలోని పలు గ్రామాల రహదారులు ధ్వంసమైపోతున్నాయి. ముఖ్యంగా ఇసుకను నింపుకొని నిత్యం టిప్పర్లు తిరుగుతుండడంతో అసలే అంతమాత్రంగా వున్న రోడ్లు రూపురేఖలు కోల్పోతున్నాయి. రోడ్లతోపాటు ఇరిగేషన్ తూములు దెబ్బతింటుండడంతో ఆయా ప్రాంతాల ప్రజలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. దాదాపు ఒకటిన్నర సంవత్సరంగా ఈ తంతు జరుగుతున్నా రహదారులు పాడైపోయి గుంటలు మిట్టలుగా మారుతున్నా సంబంధిత శాఖల అధికారులు పట్టించుకోకపోవడంతో ఇసుక తరలింపుదారులది ఇష్టారాజ్యం అయ్యింది. ప్రభుత్వ అనుమతి లేకుండా ఇసుకను తరలించుకపోతున్నా మైనింగ్ అధికారులు, రవాణాశాఖ సిబ్బంది ఆ వైపే కన్నెత్తి చూడకపోవడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. కోదూరు,



కొత్తకోదూరు గ్రామాల్లో రోడ్లు పూర్తిగా ధ్వంసమైపోతున్నాయి. ఈ ప్రాంతంలోగల తూములు కుంగిపోవడంతోపాటు దెబ్బతిని పడిపోయాయి. అధికారులు ఇప్పటికైనా స్పందించి ఇసుక వాహనాలను అరికట్టాలని రోడ్లకు మరమ్మత్తులు చేయించాలని స్థానికులు కోరుకొంటున్నారు.

# ఎస్సీ, ఎస్టీల సమైక్య రణభేరి!

## వెంకటగిరిలో బ్రహ్మాండంగా జరిగింది

కేంద్ర ప్రభుత్వం తీసుకొన్న రాష్ట్ర విభజన నిర్ణయాన్ని, సమైక్యాంధ్ర ఉద్యమాన్ని లెక్క చేయకుండా క్యాబినెట్ నోట్‌ను తయారు చేయడాన్ని నిరసిస్తూ వెంకటగిరిలో ఎస్సీ, ఎస్టీల ఆధ్వర్యంలో సమైక్య రణభేరిని పెద్ద ఎత్తున నిర్వహించారు. పట్టణంలోని విశ్వోదయ కళాశాల నుంచి భారీ ర్యాలీని చేపట్టారు. ఈ సందర్భంగా చేపట్టిన సాంప్రదాయక నృత్యాలు, కళా రూపాలు పట్టణ ప్రజలను ఆకట్టుకొన్నాయి. రణభేరి కన్వీనర్ కె.సహదేవయ్య మాట్లాడుతూ రాష్ట్ర విభజనపై కేంద్రం ప్రజాభిప్రాయం తెలుసుకోకుండానే ఏకపక్షంగా వ్యవహరించిందని విమర్శించారు. కేంద్ర నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచాలని సీమాంధ్రలో పెద్ద ఎత్తున ఉద్యమిస్తుంటే దానిని పరిగణనలోకి తీసుకోకపోవడం దారుణమన్నారు. మరోవైపు కేంద్ర నాయకత్వం రోజుకో ప్రకటన చేస్తూ సీమాంధ్ర ప్రజలను రెచ్చగొడుతున్నారని విమర్శించారు. పదిహేనేళ్లుగా విడివిడిగా కార్యక్రమాలు నిర్వహిస్తున్న ఎస్సీ, ఎస్టీలు ఈ సమైక్యాంధ్ర నిరసన ర్యాలీలో అందరూ ఏకమయ్యారన్నారు. కేంద్రం రాష్ట్ర విభజన నిర్ణయంపై పునరాలోచించాలన్నారు. ఈ రణభేరి కార్యక్రమంలో మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి నాయకుడు శ్రీనివాసులు, గిరిజన నేత కత్తి ఆదిశేషయ్య, మాల మహానాడుకు చెందిన రాజా, నక్కలోళ్ల సంఘం నేత పరశురాం, శితరాసి బాలయ్య, నాగభూషణం తదితరులు పాల్గొన్నారు.

విదేశీయాన శుభాకాంక్షలు
అయితే ఇది మొదలుకొని నేను మిమ్మును ఆశీర్వదించెదను.
హగ్గయి. 2:19
ఉన్నత చదువుల కోసం
ఐర్లాండ్ దేశానికి వెళుతున్న
మా చిరంజీవి
లక్కాకుల ప్రదీప్‌కుమార్ M.S.కు
విదేశీయాన శుభాకాంక్షలు.
దేవుని కృప వల్ల ఉన్నత చదువులు
దిగ్విజయంగా పూర్తి చేసుకోవాలని
కోరుకొంటూ...
తల్లితండ్రులు
లక్కాకుల మాధవరావు
లక్కాకుల రమాదేవి
తమ్ముడు
లక్కాకుల అజయ్‌కుమార్
తాళ్ళూరు, బోగోలు మండలం, నెల్లూరుజిల్లా

# ఆరోగ్య కేంద్రాలు అనవసరం!

## గ్రామాల్లో వైద్య సేవలపై కోవూరు ఎమ్మెల్యే అసంతృప్తి



వైద్యులు సక్రమంగా పని చేయకపోవడం, అవసరమైన మందులు వుండకపోతుండడంతో ఆరోగ్య కేంద్రాలు ప్రజలకు ఉపయోగపడడం లేదని, వైద్య సహాయం అందడంలేదని కోవూరు శాసనసభ్యుడు నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి విమర్శించారు. వివిధ ప్రాంతాలలో విష జ్వరాలు ప్రబలి ప్రజలు మంచం పడుతున్నా కనీస పాటి చలనం వైద్యులు, సిబ్బందిలో లేకపోవడం బాధాకరమన్నారు. కోవూరు నియోజకవర్గ పరిధిలోని విడవలూరు మండలంలోని పలు గ్రామాల ప్రజలు జ్వరాలతో బాధపడుతుండడంతో ఇటీవల ఆయన ఆయా ప్రాంతాల్లో పర్యటించి అనారోగ్య పీడితులను పరామర్శించారు. ఈ సందర్భంగా ఆయన వైద్యుల పనితీరుపై తనదైన శైలిలో విమర్శలు గుప్పించారు. నియోజకవర్గంలోని పలు ప్రాంతాల్లో జ్వరాలు అధికంగా వుంటున్నాయని, అధిక సంఖ్యలో జ్వరాల బారిన పడుతున్నారని తెలిపారు. ఆరోగ్య కేంద్రాలలో సక్రమంగా వైద్య సేవలు అందడం లేదని, కనీసం ఇలాంటి పరిస్థితులలోనైనా అధికారులు చొరవ చూపక పోవడం పట్ల తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. ప్రజల ఆరోగ్యం పట్ల వైద్యులు, అధికారులకు ఇంత నిర్లక్ష్యం తగదన్నారు. అలాగే పంచాయతీల్లో పారిశుధ్యం లోపించిందని, ఫలితంగానే విష జ్వరాలు ప్రబలుతున్నాయన్నారు. సర్పంచ్‌లు పదవులు చేపట్టి మూడు నెలలు గడుస్తున్నా ఇంతవరకు చెక్ పవర్ ఇవ్వలేదన్నారు. దీని వల్ల పంచాయతీలలో పారిశుద్ధ్య చర్యలు చేపట్టడానికి నిధుల కొరత ఏర్పడుతున్నదన్నారు. ఈ సమస్యలను దృష్టిలో పెట్టుకొని సర్పంచ్‌లకు చెక్ పవర్ ఇవ్వాలని డిమాండ్ చేశారు.

# చేజర్ల, కలువాయిల్లో డెంగ్యూ జ్వరాలు!

## పత్తాలేని వైద్య ఆరోగ్య శాఖాధికారులు

కలువాయి, చేజర్ల మండలాల్లో డెంగ్యూ జ్వరాలు ప్రబలుతున్నాయి. ఈ మండలాల పరిధిలోని గ్రామాల్లో పారిశుధ్యం అధ్వాన్నంగా వుండడం, దోమలు విజృంభిస్తుండడంతో పలువురు విష జ్వరాల బారినపడి మంచం పడుతున్నారు. పలువురికి డెంగ్యూ లక్షణాలు బయటపడడంతో స్థానికులు వణికిపోతున్నారు. మండలాల్లో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు వున్నా వైద్య సేవలు అందుబాటులో లేకపోవడంతో ప్రజలు ప్రైవేటు ఆస్పత్రులకు వెళ్లి చికిత్స పొందాల్సిన పరిస్థితులు తలెత్తుతున్నాయి. మలేరియా, టైఫాయిడ్ జ్వరాలతోపాటు డెంగ్యూ జ్వరాల బారినపడేవారి సంఖ్య రోజురోజుకూ అధికం అవుతుంది. చేజర్ల మండలంలోని కాకివాయి గ్రామానికి చెందిన ఒక మహిళ, కలువాయి మండలం లలితానగర్‌కు చెందిన మరో మహిళ డెంగ్యూ బారినపడి నెల్లూరు బొల్లినేని ఆస్పత్రిలోనూ, మద్రాసు విజయ ఆస్పత్రిలోనూ చికిత్స పొందుతున్నారు. చాలా మంది సాధారణ జ్వరం అనుకొని అందుబాటులో వున్న మాత్రలు వేసుకొని జ్వరం అధికం అయిన తర్వాత వైద్యుల వద్దకు పరుగులు పెడుతున్నారు. దీన్ని అవకాశంగా చేసుకొన్న కొందరు ప్రైవేటు వైద్యులు జ్వరపీడితులను జలగల్లా పీల్చి పిప్పి చేస్తున్నారన్న విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. అధికారులు పరిస్థితి తీవ్రతను గుర్తించి గ్రామాల్లో పారిశుధ్యాన్ని మెరుగు పరచాలని, మంచినీటి పథకాల్లో క్లోరినేషన్ చేయించాలని, వైద్య శిబిరాలు ఏర్పాటు చేసి సరైన వైద్యసేవలు అందించాలని పై రెండు మండలాలకు చెందిన ప్రజలు కోరుతున్నారు.

● గూడూరులో...

# శిలాఫలకాల ధ్వంసంపై కేసులు!

## బెదరమన్న వైకాపా నేతలు

జిల్లా వ్యాప్తంగా జరుగుతున్న సమైక్యాంధ్ర ఉద్యమంలో ఉద్యోగులు, ప్రజాసంఘాలు, వ్యాపారులు, ఉపాధ్యాయులు, విద్యార్థులతోపాటు అధికార, ప్రతిపక్ష పార్టీలు వేరువేరుగా నిరసన కార్యక్రమాలను చేపడుతూ రాష్ట్ర విభజన నిర్ణయాన్ని వ్యతిరేకిస్తున్నా గూడూరులో మాత్రం పరిస్థితి అందుకు విరుద్ధంగా వుంది. ఇక్కడ మిగతా అన్ని వర్గాల వారు, వివిధ పార్టీలు ఉద్యమంలో చురుకుగా పాల్గొంటుండగా కాంగ్రెస్ నేతలు, కార్యకర్తలు ఏ నిరసన కార్యక్రమం చేపట్టడం లేదు, ఏ దీక్షలకూ మద్దతు తెలపడం లేదు. అధికార కాంగ్రెస్ పార్టీ నేతల తీరును నిరసిస్తూ ఇటీవల వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ కొంత దూకుడుగా వ్యవహరించింది. కేంద్రమంత్రి పనబాక లక్ష్మి, రాష్ట్ర ఆర్థికశాఖా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, తిరుపతి పార్లమెంటు సభ్యుడు చింతా మోహన్, పనబాక కృష్ణయ్యలు పలు అభివృద్ధి కార్యక్రమాలకు చేసిన శంకుస్థాపన శిలాఫలకాలను ధ్వంసం చేశారు. ఇది కలకలం సృష్టించిన విషయం తెలిసిందే. దీనిపై అధికార పార్టీ నేతలు ఒత్తిడిచేసి ఆయా శాఖల అధికారులతో పోలీసు కేసులు పెట్టించడంపై వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేత పాశం సునీల్‌కుమార్ తీవ్రంగా మండి పడ్డారు. ప్రజలను దగా చేస్తూ ముఖం చాటేసిన కాంగ్రెస్ నేతలు ఇలా అక్రమ కేసులు పెట్టి బెదిరించాలని చూస్తున్నారన్నారు. అయితే ఇలాంటి తాటాకు చప్పుళ్లకు భయపడేది లేదన్నారు.

# అసెంబ్లీలో అడుగుపెట్టను!

## వచ్చే ఎన్నికల్లో గెలిపిస్తేనే వెళ్తానంటున్న గూడూరు ఎమ్మెల్యే

సమైక్యాంధ్రకు మద్దతుగా రాజీనామా చేశానని గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ తెలిపారు. గూడూరు క్లాక్ టవర్ సెంటర్ నందు సమైక్యాంధ్రకు మద్దతుగా తెలుగుదేశం పార్టీ చేపట్టిన రిలే నిరాహార దీక్షల్లో పాల్గొని ప్రసంగించారు. కేంద్రం రాష్ట్ర విభజనకు తీసుకున్న నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ శాసనసభ్యత్వానికి రాజీనామా చేశానని, రాజీనామా పత్రాన్ని స్పీకర్‌కు అందజేశానని తెలిపారు. ఇకపై తాను శాసనసభకు అడుగుపెట్టనని, వచ్చే ఎన్నికల్లో ఎమ్మెల్యేగా ఎన్నికైన తర్వాత తిరిగి శాసనసభలో అడుగు పెడతానని స్పష్టం చేశారు. ఈ సందర్భంగా దీక్షా శిబిరం వద్దకు వచ్చిన జెఏసి నాయకులు జోక్యం చేసుకొని తెలంగాణ బిల్లు అసెంబ్లీకి వచ్చినప్పుడు దానిని ఓడించేందుకు వెళ్లాలని కోరడంతో అందుకు ఎమ్మెల్యే సమ్మతించారు. ప్రజల అభిప్రాయాలకు అనుగుణంగా శాసనసభలో తీర్మానాన్ని ఓడిస్తామని హామీ ఇచ్చారు. అనంతరం సోనియాగాంధీకి దశదిన కర్మకాండ నిర్వహించి నిరసన తెలిపారు. అలాగే సమైక్యాంధ్ర ఉద్యమంలో పాల్గొంటూ అశువులు భాసిన ఉద్యమకారులు శంకరయ్య యాదవ్, ఆర్టీసి కార్మికుడు సోమశేఖర్ రాజు కుటుంబాలకు చెరొక 50 వేల రూపాయల ఆర్థిక సహాయాన్ని అందజేశారు.

● చంద్రబాబు

# సిఎం కావడం ఖాయం!

## ఉదయగిరి టిడిపి ఇన్‌ఛార్జి బొల్లినేని

వచ్చే ఎన్నికల్లో ప్రజలు తెలుగుదేశం పార్టీని అఖండ మెజార్టీతో గెలిపిస్తారని, చంద్రబాబు నాయుడు తిరిగి ముఖ్యమంత్రి కావడం ఖాయమని ఉదయగిరి నియోజకవర్గ తెలుగుదేశం పార్టీ ఇన్‌ఛార్జి బొల్లినేని రామారావు జోస్యం చెప్పారు. ఇటీవల నియోజకవర్గ పరిధిలో గల దుత్తలూరు, సోమలరేగడ, వెంకటంపేట, పాపంపల్లి, నందిపాడు ప్రాంతాలకు చెందిన 50 మంది వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి చెందిన కార్యకర్తలు బొల్లినేని రామారావు ఆధ్వర్యంలో తెలుగుదేశం పార్టీ తీర్థం పుచ్చుకొన్నారు. వైకాపా వీడి తెలుగుదేశం పార్టీలో చేరేందుకు వచ్చిన అందరిని పేరుపేరున పలకరించి పార్టీలో చేర్చుకొన్నారు. ఈ సందర్భంగా బొల్లినేని రామారావు మాట్లాడుతూ కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలు కుమ్మక్కై ప్రజలను దగా చేస్తున్నాయన్నారు. కాంగ్రెస్ ఢిల్లీ పెద్దలతో కుదిరిన ఒప్పందం కారణంగానే బెయిల్ వచ్చి జగన్ జైలు నుంచి బయటకు రాగలిగారని ఆరోపించారు. ఈ రెండు పార్టీలు ఆడుతున్న దొంగ నాటకాలను ప్రజలు గమనిస్తూనే వున్నారని వచ్చే ఎన్నికల్లో తగిన గుణపాఠం చెప్తారన్నారు. అలాగే 60 రోజులకుపైగా సమైక్యాంధ్ర ఉద్యమంలో పాల్గొన్న ఉదయగిరి ఆర్టీసి కార్మికులు 430 మందికి ఒక్కొక్కరికి 25 కేజీల బియ్యాన్ని పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో తెలుగుదేశం పార్టీ జిల్లా కార్యవర్గ సభ్యుడు కె.మోహన్‌చౌదరి తదితరులు పాల్గొన్నారు.

NIPPO
BATTERIES TORCHES
Get more out of Life









Technology from MATSUSHITA ELECTRIC Japan.



# వెలుగు దివ్వెల పండుగ దీపావళి!

అలౌకిక ఆనందాన్ని ఇచ్చేవి, మానసిక అనుభూతిని కల్గించేవి పండుగలు. భారతీయ ఆధ్యాత్మిక ఆచార సాంప్రదాయాలలో ఈ పండుగలకు విశేష ప్రాధాన్యముంది. ఏడాది పొడవునా వచ్చే పండుగల్లో ఒక్కో పండుగకు ఒక్కో ప్రత్యేకత వుంది. సంతోషాన్ని, శోభను తీసుకవచ్చే ఈ పండుగల్లో ఆశ్వీయుజ మాసంలో వచ్చే నరక చతుర్దశి, దీపావళి పండుగలు ప్రత్యేకమైనవి. లోకానికి అసుర బాధలను తొలగించి అమావాస్య చీకట్లలో దీపాల వెలుగులు నింపే పండుగే దీపావళి. సంస్కృతంలో వళి అంటే వరుస అనే అర్థం వుంది. దీపాల వరుస కాబట్టే దీనికి దీపావళి అనే పేరొచ్చిందని చెబుతారు. దీపం పరబ్రహ్మ స్వరూపం అంటారు. అలాంటి దీపంలో దేవతలు వున్నారు, వేదాలు వున్నాయి. దీపంలో శాంతి వుంది, కాంతి వుంది. సకల దేవతా స్వరూపమైన దీపం లోకంలోని చీకట్లను పారద్రోలి వెలుగును పంచుతుంది. అలాంటి దీపావళి పండుగను దేశవ్యాప్తంగా వివిధ ప్రాంతాలలో వేడుకగా జరుపుకొంటారు. చిన్నా పెద్ద, ఆడ మగ అనే బేధభావం లేకుండా ఆనందోత్సాహాలతో మునిగి తేలుతారు.

ఆశ్వీయుజ బహుళ చతుర్దశి, అమావాస్య, పాడ్యమి తిథులను కలిపి నరక చతుర్దశి అని, దీపావళి అని, బలి పాడ్యమి అని మూడు రోజులపాటు పండుగలు చేసుకొనే ఆచార సాంప్రదాయం పలు ప్రాంతాలలో వుంది. ఈ పండుగకు సంబంధించి పురాణగాథ ఒకటి ప్రచారంలో వుంది. నరకాసురుడు ప్రాగ్ జ్యోతిషపురాన్ని రాజధానిగా చేసుకొని రాజ్యమేలుతూ రుషులను, దేవతలను వేధించసాగాడు. భూదేవి కుమారుడైన నరకుడు, తల్లి చేతిలో తప్ప మరే విధంగా మరణం సంభవించని రీతిలో వరం పొంది వున్నాడు. అలాంటి అసురుడి బాధల నుంచి విముక్తి కల్పించమని దేవతలు, మహర్షులు శ్రీ కృష్ణ పరమాత్ముడిని మొరపెట్టుకొన్నారు. వారి కష్టాలను తొలగించేందుకు కృష్ణ భగవానుడు నరకాసురిడితో యుద్ధం చేశాడు. నరకుడి మరణ రహస్యం తెలిసిన వాసుదేవుడు భూదేవి అవతారమైన సత్యభామతో నరకాసురుడిని సంహరింపజేస్తాడు. ఆ సమయంలో నరకాసురుడు చెరపట్టి వుంచిన 16వేల మంది మహిళలు శ్రీకృష్ణుడిని కోరుకొంటారు. వారి అభీష్టాన్ని మన్నించిన శ్రీకృష్ణుడు వారిని స్వీకరిస్తాడు. ఆనాటి నుంచే శ్రీకృష్ణుడికి 16వేల మంది గోపికలనేది స్థిరపడింది. నరకాసురుడు ఆశ్వీయుజ బహుళ చతుర్దశినాడు సంహరించబడినందున ఆ చతుర్దశిని నరక చతుర్దశి అని, మరుసటి రోజు వచ్చే అమావాస్యనాడు ప్రజలందరూ దీపాలు వెలిగించి ఆనందం వ్యక్తం చేసినందున దీపావళిని జరుపుకొనే సాంప్రదాయం కొనసాగుతోంది. మూడవరోజైన పాడ్యమిని బలి పాడ్యమిగా పిలవడంలోనూ ఒక పురాణ కథ వుంది. శ్రీమహావిష్ణువు వామనావతారంలో బలి చక్రవర్తిని పాతాళానికి అణచివేయబడినరోజు పాడ్యమి కాబట్టి దానికి గుర్తుగా పాడ్యమని బలి పాడ్యమిగా చేసుకొంటారు ఉత్తరదేశంలో. బాణా సంచా కాల్చడం, దీపాలు వెలిగించడంతోపాటు మార్వాడీలు లక్ష్మీ పూజను ప్రత్యేకంగా జరుపుతారు. ఆనాటి నుంచి కొత్త పద్దులు వ్రాయడం ఆరంభిస్తారు. వెలుగుదివ్వెలను ప్రసాదించే దీపావళి పండుగకు ఇంతటి విశిష్టత వుంది.

– రామనారాయణ

దేవదేవుని కళ్యాణం

# కన్నుల పండుగగా శ్రీనివాసుని కళ్యాణం!





## విపిఆర్ కన్వెన్షన్ సెంటర్‌లో జరిగిన తొలి వేడుక ఇది.

మంచి మనసుతో ఏ కార్యక్రమం చేపట్టినా అది విజయవంతమవడం ఖాయం. కనుపర్తిపాడులో వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి నభూతో నభవిష్యతి రీతిలో నిర్మించిన విపిఆర్ కన్వెన్షన్ సెంటర్ ప్రారంభోత్సవాన్ని పురస్కరించుకొని 19తేది సాయంత్రం నిర్వహించిన కలియుగ దైవం శ్రీనివాసుని కళ్యాణ మహోత్సవం కన్నుల పండుగగా జరిగింది. దూరాభారమని ఆలోచించకుండా వేలాది మంది సతీసమేతంగా సాంప్రదాయ దుస్తులతో ఈ వేడుకకు హాజరయ్యారు. కన్వెన్షన్ సెంటర్‌లో కాలిడిన వెంటనే భక్తులకు తిరునామాలు పెట్టి కళ్యాణోత్సవ వేదిక వద్దకు పంపారు. వేదికపై వైకుంఠంలోని బంగారు వాకిలిని పోలిన సెట్టింగ్ వేసి శ్రీచక్రం, శంకు చక్రాలు, తిరునామం అమర్చారు. ప్రత్యేకంగా చేసిన పుష్పాలంకరణ మధ్య శ్రీదేవి, భూదేవుల సమేతంగా శ్రీనివాసుని చూడను రెండుకళ్లు చాలలేదనాలి. తిరుమల తిరుపతి దేవస్థానం నుంచి వచ్చిన వేదపండితులు పుణ్యాహవచనం చేసి శ్రీవారి సర్వసైన్యాధిపతి విష్వక్సేనుల వారిని వేడుకకు తొలుత ఆహ్వానించి కళ్యాణ వేదికపై అగ్నిని రాజేశారు. నిత్యకళ్యాణ చక్రవర్తి శ్రీనివాసుడు దేవతలందరిలో పెద్దవారని, అగ్నిదేవుడు చిన్నవాడని ఈ సందర్భంగా కళ్యాణాన్ని నిర్వహిస్తున్న అర్చక స్వామి భక్తులకు విన్నవించారు. కళ్యాణోత్సవం నిర్వాహకుడు వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి, తిరుమల తిరుపతి దేవస్థానం ఛైర్మన్ కనుమూరి బాపిరాజు, ఒంగోలు ఎమ్పీ మాగుంట శ్రీనివాసులు రెడ్డి, ప్రభాకర్‌రెడ్డి సోదరుడు కోటారెడ్డి, ఆయన సతీమణి కంకణధారణతో వివాహ మహోత్సవం ప్రారంభమయ్యింది. దేవస్థానం గాయకులు వివాహ ఘట్టంలో వివిధ దశలను బట్టి పాడిన పాటలు మనోల్లాసాన్ని, భక్తిపారవశ్యాన్ని నింపగా రాత్రి 7.40 నిమిషాలకు దేవేరులకు స్వామి మాంగల్యధారణ గావించారు. ఈ కమనీయ దృశ్యం చూసి భక్తులు పులకించి పోయారు. ఈ సందర్భంగా తిరుమల తిరుపతి దేవస్థానం ఛైర్మన్ కనుమూరి బాపిరాజు మాట్లాడుతూ నెల్లూరు శ్రీనివాసుని కళ్యాణం కమనీయం గావించిన ఘనత వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డిదేనని శ్లాఘించారు. వేలాదిమంది భక్తులకు తిరుపతి లడ్డూ ప్రసాదంగా ఇవ్వడంతోపాటు శ్రీవారికి ఎంతో ఇష్టమైన అన్నప్రసాదాలను సైతం వండి వడ్డించారు. భక్తులు ఎంతో క్రమశిక్షణగా కార్యక్రమం ముగిసేవరకు వ్యవహరించడం ఇక్కడ ప్రత్యేకంగా చెప్పుకోవాలి. రాష్ట్ర ఆర్థికమంత్రి ఆనం రామనారాయణ రెడ్డి సైతం తీరిక చేసుకొని శ్రీనివాసుని కళ్యాణంలో పాల్గొన్నారు. శ్రీనివాసుని కళ్యాణాన్ని కనులారా వీక్షింపచేసిన వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డిని ఈ కార్యక్రమానికి విచ్చేసిన భక్తులు అభినందిస్తుండడం కనిపించింది.



# సోమశిలలో నీరున్నా విడుదలకు మీనమేషాలు!

## • వ్యవసాయ సీజన్ మొదలైనా నవంబర్ 1తేదీ తర్వాతే నీటి విడుదల.

జిల్లా సాగునీటి సలహా మండలి సమావేశం రసాభాసగా జరిగింది. ఉదయం 11.30 గంటలకు ప్రారంభం కావాల్సిన సమావేశం మంత్రిరాక ఆలస్యం కావడంతో 12 గంటలకు ప్రారంభమైంది. సమావేశం ప్రారంభం కాకముందే సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసా రత్నం పోలీసులు తన పట్ల అమర్యాదగా వ్యవహరించారంటూ, ఇందుకు బాధ్యులైన పోలీసు అధికారులపై చర్యలు తీసుకోవాలని వేదికపైనున్న జిల్లా కలెక్టర్ శ్రీకాంత్‌కు ఫిర్యాదు చేశారు. జోరు వర్షంలో సమావేశానికి వస్తున్న తనను గేటు బయట నిలిపివేయడంతో వర్షంలో తడవాల్సి వచ్చిందంటూ ఆవేదన వ్యక్తం చేశారు. పరసా వ్యాఖ్యలకు స్పందించిన మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డిలు మాట్లాడుతూ పనిగట్టుకొని ఉద్దేశంతో పోలీసులు అడ్డుకోలేదని, ముందుగా కొందరు టిడిపి నేతలు, కార్యకర్తలు గేటు బయట ఆందోళన చేస్తున్న సమయంలో ఎమ్మెల్యే రావడంతో కొంత ఇబ్బంది ఏర్పడిందంటూ పరసా రత్నంకు జరిగిన సంఘటనపై వివరణ ఇస్తూ భవిష్యత్తులో ఇలా జరగకుండా చూస్తామని హామీ ఇచ్చారు.

సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి, నెల్లూరు నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డిలు రైతులు ఎదుర్కొంటున్న సమస్యలు, సాగునీటి అవసరాల గురించి పెద్దగా చర్చించలేకపోయారు. ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం ఐఏబి సమావేశంలో అజెండాపై కాకుండా ఇతర సమస్యలకు ప్రాధాన్యతనివ్వడం తగ్గించాలని సూచించారు. నీటి పారుదల శాఖ అధికారులు రూపొందించిన అజెండాలో కూడా సరైన వివరాలు పొందుపరచలేక పోయారని వ్యాఖ్యానించారు. ఇతర అంశాలపై చర్చ తగ్గించి రైతులకు సాగునీరు విడుదల, పనులు వేగవంతం చేసే దానిపై దృష్టిసారిస్తే ప్రయోజనం వుంటుందని చెప్పారు.

### నవంబర్‌లో నీటి విడుదల

జిల్లాలో సాగుకు సంబంధించి నవంబర్ మొదటి వారంలో సోమశిల రిజర్వాయర్ నుండి నీటిని విడుదల చేయాలని ఐఏబి సమావేశంలో తీర్మానించారు. పెన్నా డెల్టా క్రింద నాలుగు లక్షల ఎకరాలు, కండలేరు రిజర్వాయర్, ఇతర కాల్వల క్రింద లక్ష ఎకరాల ఆయకట్టు సాగుబడి కానుంది. ఐఏబి సమావేశంలో చేసిన తీర్మానాన్ని ప్రభుత్వానికి పంపి ఆమోదం పొందేందుకు పది రోజుల వ్యవధి పడుతున్నందున నవంబర్ మొదటి వారానికి నీటిని విడుదలచేసే అవకాశం వుంది. ఇప్పటికే వ్యవసాయ సీజన్ ప్రారంభం కావడం బాగా



ఐఏబి సమావేశంలో నిరసన తెలియజేస్తున్న తెలుగుదేశం ఎమ్మెల్యేలు.

ఆలస్యం జరిగింది. సోమశిల రిజర్వాయర్‌లో అవసరమైన నీటి లభ్యత వున్నప్పటికీ ఐఏబి సమావేశం నిర్వహించి నీటిని విడుదల చేసేందుకు జిల్లా మంత్రి, అధికారులు తగిన చొరవ చూపలేదన్న విమర్శలు మూటగట్టుకున్నారు.



### పనుల్లో అక్రమాలపై విచారణ జరపాలి!

సాగునీటి ప్రాజెక్టుల నిర్మాణం, కాల్వల లైనింగ్ పనులపై సమగ్రమైన విచారణ జరిపించి నివేదిక సమర్పించాలి. చిట్టమూరు మండలంలో కాల్వల కరకట్లకు పదేపదే వివిధ రకాల పేర్లతో పనులు చేసినట్లు అధికారులు చెబుతున్నారు. ఒకే పనికి లక్షలాది రూపాయలు ఖర్చు చేయడం ఆశ్చర్యకరంగా వుంది. ఇందుకు ప్రతిపాదనలు తయారుచేసిన అధికారులు పనులు చేసిన కాంట్రాక్టర్లపై చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది. నీటి పారుదల శాఖలో జరుగుతున్న అక్రమాలను వెలుగులోకి తీసుకొచ్చేందుకు ప్రభుత్వం విచారణ జరిపించాలన్న తీర్మానం చేయాలి.

బల్లి దుర్గాప్రసాద్‌రావు, , గూడూరు ఎమ్మెల్యే.



### నీటి తరలింపు అడ్డుకొంటాం!

జిల్లా ప్రజల అవసరాలను కాదని చిత్తూరు జిల్లాకు నీటిని తరలించేందుకు అధికారులు ప్రయత్నిస్తే అడ్డుకుంటామని హెచ్చరిస్తున్నాను. నీటి విడుదలకు సంబంధించి రాష్ట్ర ప్రభుత్వం ఈ నెల 4వ తేది ప్రత్యేక జిఓ జారీ చేయడం అనుమానాలకు దారితీస్తుంది. ముఖ్యమంత్రి సొంత జిల్లాకు కండలేరు రిజర్వాయర్ నుండి నీటిని తరలించాలనడం జిల్లా ప్రజల మనోభావాలను దెబ్బతీయడమే అవుతుంది. నీటి తరలింపును అడ్డుకునేందుకు ఎంతటి త్యాగానికైనా నేను సిద్ధంగా వున్నాను. ప్రభుత్వం జారీచేసిన జిఓను ఉపసంహరించుకోవాలని డిమాండ్ చేస్తున్నాను.

కురుగొండ్ల రామకృష్ణ, వెంకటగిరి ఎమ్మెల్యే.



### నెల్లూరు సంగతి చూడండి!

సోమశిల రిజర్వాయర్ నుండి నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్‌కు నీటి కేటాయింపులు వున్నాయి. నగర ప్రజలకు అవసరమైన తాగునీటి సరఫరాను సమ్మర్‌స్టోరేజి ట్యాంకు నుండి చేస్తున్నాం. ప్రస్తుతం సరఫరా చేస్తున్న నీరు రంగు మారి వస్తుండడంతో ప్రజలు త్రాగడం లేదు. నెల్లూరు నగరానికి కేటాయించిన నీటిని విడతల వారీగా విడుదల చేస్తే ప్రజలకు రక్షిత మంచినీరు అందించడం జరుగుతుంది. సోమశిల రిజర్వాయర్ నీటిని చెన్నై, చిత్తూరు జిల్లాలకు విడుదల చేసే ముందు నెల్లూరు నగరాన్ని కూడా దృష్టిలో వుంచుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

ఆనం వివేకానందరెడ్డి, నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే.

# పిసిసి కార్యదర్శిగా జర్నలిస్టు మధు



రాష్ట్ర ప్రదేశ్ కాంగ్రెస్ సంఘం కార్యవర్గంలో నెల్లూరు జిల్లా నుంచి డి.మధుసూధన్‌రావుకు స్థానం లభించింది. ఆయన్ను పిసిసి కార్యదర్శిగా నియమిస్తూ బొత్సా సత్యనారాయణ ఉత్తర్వులు పంపాడు. మధు ప్రతికా విలేఖరి. ఇరవై ఏళ్లకు పైనుంచి వివిధ పత్రికలలో పనిచేశాడు. పత్రికా విలేఖరిగా కంటే తిరుపతి ఎమ్పీ చింతా మోహన్ ముఖ్య అనుచరునిగా అందరికీ తెలిసిన వాడు. చింతా మోహన్‌కు అనుచరుడు అనడం కంటే ఆంతరంగిక సలహాదారు అనడం వాస్తవం. మధుతో మాట్లాడనిదే చింతా మోహన్ ఏ రాజకీయ చర్యకూ ఉపక్రమించడు.

నెల్లూరు జిల్లా నుంచి పిసిసిలో అర డజనుకు తగ్గకుండా ప్రాతినిధ్యం కల్పించడం గత ముప్పై ఏళ్లుగా నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి పాటించిన సాంప్రదాయం. కానీ ఇప్పుడాయన రాజకీయాల్లో లేడు. ఆయన స్థానంలో వచ్చిన ఆనం రామనారాయణరెడ్డికి రాజకీయం అంటే తన ఇల్లు, తన కుటుంబం మాత్రమే. మురుగు కాలువల సంఘం సభ్యత్వం అనే పదవికి నియామకం జరపవలసి వచ్చినా తన తమ్ముడినో, అన్ననో చూపుతాడు తప్ప పార్టీ కార్యకర్తలను, నేతలను పట్టించుకోడు. అదొక రకం కుల్లుబోతు తనం. ఆ బుద్ధి వల్లనే ఈ సారి పిసిసిలో నెల్లూరు నుంచి ఏ ఒక్కరికీ పదవి దక్కలేదు. మాదాసు గంగాధరం మాత్రం ఉపాధ్యక్షుడిగా కొనసాగుతున్నాడు. జిల్లా నుంచి ఎవరూ లేరన్న కొరత తీర్చాడు చింతా మోహన్.

# వాకాటి నారాయణరెడ్డి మీద ఇన్‌కంటాక్స్ ముట్టడి!



స్థానిక సంస్థల ఎమ్మెల్సీ, నెల్లూరు జిల్లా రాజకీయాలలో ఆకాశం నుంచి ఊడిపడినట్లు వెలుగులోకి వచ్చిన కొత్త కుబేరుడు వాకాటి నారాయణరెడ్డి ఇల్లు, ఆఫీసులను ముట్టడించారు ఇన్‌కమ్ టాక్స్ అధికారులు. 23వ తేది ఉదయం నుంచి 24వ తేది ఉదయం వరకు 24 గంటలకు పైగా సోదాలు జరిపారు.

నారాయణరెడ్డి స్వయంశక్తితో వృద్ధిలోకి వచ్చిన వ్యాపారవేత్త. ఆయన ఎదుగుదల సమస్తం గత ఐదారేళ్లలోనే జరిగింది. అంత స్వల్ప కాలంలో అంత ఉన్నతికి వస్తే సహజంగానే ఇన్‌కమ్ టాక్స్ విభాగానికి సందేహాలు పొడసూపుతాయి. వాటి నివృత్తి కోసమే ఇంత భారీ స్థాయిలో దాడులు జరిపినట్లున్నారు. ఆ దాడుల వల్ల వాకాటి నారాయణరెడ్డి వ్యాపారాలకు పెద్దగా ఇబ్బంది ఏదీ లేదని తెలుస్తున్నది. వ్యాపారంలో ఎదగాలంటే ఇటువంటి సవాళ్లు ఎదుర్కోక తప్పదు. నారాయణరెడ్డి మనోస్థైర్యంతో మనగలుగుతాడని మా విశ్వాసం.

దివ్యస్నానం

అకాల వర్షంలోనైనా, వలువలతో నిలువెల్లా తడిచినా, గోధూళిలో మేను, దుస్తులతోటి మాసినా, లేదా కనీసం కౌపీనం(గోచీ) పెట్టుకుని పురుషులు చేసే స్నానమైనా, వీటిని 'దివ్య' స్నానమని 'ఆకాశ' స్నానమనీ అంటారు. మగవారి నగ్నస్నానం 'నరక' హేతువు. పిదప గోచీ తీసే ముందు, టవల్‌లాంటి దాన్ని కట్టుకుని ఆ ప్రాంతాన్ని శుభ్రపర్చుకోవాలి. 'సమాప్తి, సూక్తి':- ఇట్టి ఆపాదమస్తక స్నానాదుల వలన పుణ్యమేగాని, పది రోజులకొకమారు చేసినా 'పాపం' అంటారు. మీ డాక్టర్ పెళ్లకూరు జె.పి.రెడ్డి M.B.B.S., FSI.,(New Delhi) FIC.,(USA) చర్మ & తొలి సెక్సాలజిస్ట్. రైలుకట్టవీధి, పొగతోట, నెల్లూరు. 'బొల్లి', 'మంగుకై 0861– 2333666

# వృక్ష రక్షణ, నీటి పొదుపు మానవ మనుగడ మూలమని శాస్త్ర సూక్తం!

*డాక్టర్ అఖిలేష్ భట్టర్* — చెన్నై

★ *వాస్తు, జ్యోతిష, హిందూ ధర్మ శాస్త్ర సూక్తాలలో వృక్ష రక్షణ, నీటి పొదుపు శ్లోకాలను మీరు గమనించారా?*

ధర్మవిధి, తేజో సింధు, నిర్ణయ సింధు, ధర్మ పకాశిక వంటి నూట ఇరవై ప్రాచీన గ్రంథాల్లో చెట్టు, నీళ్ల మనిషి జీవికకు ఎంత ప్రధానమో చెప్పిన అంశాలు. "ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్" ఉటంకించడాన్ని బట్టి ముందున్నది అంధకారమేనని గుర్తుంచుకోవాలి.

*డాక్టర్ సత్యమూర్తి* — చెన్నై

★ *నీటికి, లక్ష్మికి గల సంబంధం ఏమిటి?*

"లక్ష్మీ క్షీరసముద్ర రాజ తనయాం" అనడాన్ని బట్టి నీరు, లక్ష్మి ఒకే రూపులని అర్థమవుతుంది. నీటిని వృథాచేసే ఇళ్లలో "లక్ష్మి" నిలవదని 'ధర్మప్రకాశిక' గ్రంథం చెబుతోంది.

*టి.తేజాదీప్తి* — చెన్నై

★ *ఒక తమిళ గ్రంథంలో భక్తురాలికి గృహంలోనూ, గ్రామంలోనూ తన నివాసానికి 'లక్ష్మీ'దేవి చెప్పిన కారణాలు మీకు గుర్తున్నాయా?*

పదహారో శతాబ్దానికి చెందిన 'సంబికణ్ణన్' 'లక్ష్మీస్తోత్ర' గ్రంథంలో వాస్తులేని గృహంలోనూ, పద్మాలకు ఆలవాలమైన నీటి మడుగులులేని గ్రామాల్లోనూ తాను నివసించలేనని ఒక భక్తురాలికి 'లక్ష్మీదేవి' చెప్పినట్లు వైష్ణవ భక్తుడు వేదాంత దేశికర్ ప్రచురించారు.

*ఎం.రమాపాండురంగ* — హైదరాబాద్

★ *'విశ్వామిత్ర' వాస్తులో వృక్ష దేవతల ప్రస్తావనలను గురించి వివరిస్తారా?*

వ్యక్తి నక్షత్రాన్ని బట్టి అతని దేవతా వృక్షాన్ని శాస్త్రాలు నిర్ణయించాయి. ఉదాహరణకు మేషరాశి అధిపతి కుజుడు, వృక్షం రక్త చందనం. అందులో స్త్రీ దేవతలు నివసిస్తారన్నది శాస్త్ర వివరణ.

*డాక్టర్ సి.ఆర్.రెడ్డి* — సికింద్రాబాద్

★ *ఇంట్లో విశాలమైన స్థలం వుంది. పశ్చిమంలో మామిడి వృక్షం పెంచాము. అనూహ్యంగా మేము ఆర్థికంగా చాలా లాభపడ్డాం. తర్వాత చెట్టును తీసివేయవలసి వచ్చింది. కుటుంబం బాగా చితికి పోయింది.*

మామిడి(ఆమ్ర) లక్ష్మీదేవి ప్రీతికరమంటారు. వృక్షం పెంచితే దేవతలకు ఆశ్రయమిచ్చినట్లే. వృక్షం తీసివేయడం వల్ల వృక్షవేధ(శాపం) ఏర్పడింది. అందువల్లే మీ కుటుంబం చితికి పోయింది.

*డి.శంకరయ్యనాయుడు* — సంగం

★ *అరటి, మునగ, అవిశ వంటి చెట్లు పెరట్లో పెంచవచ్చా?*

పై చెట్లపై వున్న అపవాదుల్లో నిజం లేదు. సలక్షణంగా పెంచవచ్చు. పై మూడు చెట్లూ 'దేవతా ప్రీతి' కల్గినవి. గణపతికి ఇష్టమైనవి.

*టి.సుజన* — కర్నూలు

★ *గృహంలో ఏదైనా చెట్లను ఏ దిశలో పెంచాలి?*

దక్షిణ పశ్చిమాల్లో స్థలాన్నిబట్టి వృక్షాల్ని, మొక్కల్ని పెంచవచ్చు. తూర్పు, ఉత్తరాల్లో కూరగాయలు, పూల మొక్కల్ని పెంచవచ్చు.

*నిరుపమారెడ్డి* — నాయుడుపేట

★ *నీటి వాడకానికి 'డబ్బు'కు సంబంధమేమిటి?*

పూర్వం కొత్త కోడళ్లు నీటి వాడకాన్ని బట్టి వాళ్లు పొదుపరులో, ఖర్చుపరులో అంచనా వేసేవాళ్లు కదా? నీళ్లు 'లక్ష్మి' సమానమని శాస్త్రాలు చెబుతున్నాయి. పొదుపుగా వాడమని 'అగస్త్యసూక్తం'లో మీరు చదివారు.

*ఎ.సీతాదేవి* — కర్నూలు

★ *అశోక, అశ్వత్థ వృక్షాలు గృహంలో వేసుకోవచ్చా?*

స్థలం వుంటే అశోక, మామిడి, నిమ్మ వంటి చెట్లను దక్షిణ, పశ్చిమ ప్రాంతాలలో పెంచుకోవచ్చు. అశ్వత్థ, జమ్మి చెట్లను మాత్రం ఆలయ ప్రాంతాలలో మాత్రమే పెంచాలి.

*కె.నారాయణరెడ్డి* — వడమాలపేట

★ *వృక్షాన్ని తీసివేయవలసి వస్తే మేమేం చేయాలి?*

తప్పనిసరైతే వృక్షపూజ, యంత్ర ప్రతిష్ఠ చేసి, నలభై ఒకటవ రోజు పురోహితుడి చేత శాస్త్ర పఠనం చేయించి వృక్షాన్ని తీసివేయవచ్చు. అయితే తొమ్మిది శనివారాలు భిక్షుక స్త్రీలు ఇద్దరికి అన్నదానం చేయాలి.

*డాక్టర్ సుభద్ర* — తిరుపతి

★ *"హరిత వృక్షాణాం..." శ్లోకాన్ని గురించి వివరించండి?*

వశిష్ఠ సంహిత నాలుగవ అధ్యాయం, ముప్పై ఎనిమిదవ శ్లోకమిది. వృక్షం(చెట్టు) వుంటే గృహానికి వర్చస్సు(కాంతి) వస్తుంది. వృక్ష దేవతలు నివసించి ఆశీర్వదిస్తారు. వృక్షానికి హాని చేస్తే శపిస్తారు కూడా.

*ఎం.ఉమాదేవి* — కర్నూలు

★ *వివాహ సంబంధాల్లో 'ద్వాదశాష్ట' వివరణలు పరిశీలించారంటారు. నిజమేనా?*

అన్ని గుణాలూ అందరికీ కుదరటం జరగదు. అందువల్లే చాలా మంది సంబంధాలు వదులుకుంటున్నారు. ఫలితంగా అనవసర కాలయాపన జరిగి యువతీ యువకులు యౌవ్వన దశను దాటి పోతున్నారు. నక్షత్ర వ్యతిరేకత, గ్రహ బలాన్ని మాత్రమే పరిగణనలోకి తీసుకోవాలి.

*పి.ఎన్.ఆర్* — కావలి

★ *నాది అశ్వని, ఆమెది కృత్తిక నక్షత్రం. 'నాడి'బలరీత్యా ఎట్లా వుంటుంది?*

అశ్వని వాత నాడి, కృతిక శ్లేష్మ నాడి. ఈ నాడుల వ్యవహారం ప్రక్కనుంచండి. అశ్వనికి వ్యతిరేకత స్వాతి, హస్త నక్షత్రాల వల్ల వస్తుంది. అంచేత నక్షత్ర వ్యతిరేకత లేకుండా వుంటే మీరు ముందుకెళ్లవచ్చు.

*జి.రంగారెడ్డి* — సికింద్రాబాద్

★ *పూర్వాషాఢ, భరణి ఇద్దరి నక్షత్రాలైనపుడు అనుకూలమేనా?*

రెండూ మనుష్య గణాలు. అభ్యంతరం లేదు. ఏ నక్షత్రం వారైనా ఒకే గణంలోకి వస్తే ఉత్తమం. అయితే గ్రహబలం బాగుందో లేదో చూసుకోవాలి.

*పి.వి.రమణ* — బెంగుళూరు

★ *పుష్యమి ఒకరిది, మరొకరిది ఆశ్లేష వివాహం చేసుకోవచ్చా?*

పుష్యమి దేవగణం, ఆశ్లేష రాక్షసగణం. వ్యతిరేక గణాలని కదా మీ అభిప్రాయం. శాస్త్రం అశుభమని అంటోంది. అయితే లగ్న, తార, గ్రహబలాలు బాగుంటే వివాహమాడవచ్చునని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

*ఎన్.శపంతిదేవి* — బెంగుళూరు

★ *కూటమి విషయంలో నాది 'శిఖి', అతనిది 'కాక' కూటమి సరిపోతుందా?*

ధనిష్ఠ మీది, ఉత్తర అతనిది. రాక్షస, మనుష్య గణాలివి. అధమ స్థితి అంటుంది శాస్త్రం.

*కె.విజయారెడ్డి* — నాయుడుపేట

★ *నాడి, గుణమేళన ప్రధానమంటారు. ఎంత వరకూ నిజం?*

తారా, గ్రహ బలాలు బాగున్నప్పుడు నాడి, గుణమేళన ఎప్పుడూ ప్రధానం కాదు.

*ఎన్.ప్రదీప్‌నాయుడు* — పొదలకూరు

★ *నాది కర్కాటకం, ఆమెది వృషభ రాశి. వివాహ యోగ్యత వుందా?*

రాశులను బట్టి బ్రాహ్మణ, శూద్ర జాతివర్ణ వర్గులు వస్తున్నాయి. ఆక్షేపణ లేదు. అయితే వర్గు అంత ప్రధానమైన అంశం కాదు.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.సుజనారెడ్డి* — నెల్లూరు

★ *అనుభవజ్ఞులైన మీరు యువతీ యువకులకు వివాహ విషయంలో ఇచ్చే సూచనలేమిటి?*

శాస్త్రంలో వ్యతిరేక నక్షత్రం వున్న వారిని వివాహం చేసుకోకండి. లగ్న బలం, గ్రహబలాన్ని ముఖ్యంగా బేరీజు వేయించండి. శాస్త్రంకన్నా ముఖ్యం అవతలి వాళ్లు సంస్కారవంతులైన కుటుంబానికి చెందిన వారై వుండడం.

*సి.రఘురామారావు* — కర్నూలు

★ *'షష్టాష్టమం' అంటే ఏమిటి? వివాహానికి పాటింపు ఎలా?*

ఒక రాశి నుంచి మరొక రాశిని లెక్కించేటప్పుడు వధూవరులిద్దరికీ, ఆరు, ఎనిమిది సంఖ్యలు రాకూడదంటారు. అయితే పాటింపు లేదన్నది నా అభిప్రాయం.

*ఎల్.వి.కె* — హైదరాబాద్

★ *మా నక్షత్రాలు వివాహానికి కుదరవన్నారు? మేము ప్రేమించుకున్నాం?*

మీ నక్షత్రాలేవో రాయలేదు. 'నిర్ణయ సింధు' ధర్మ శాస్త్రంలో ఇలా వుంది. " చేయకూడని నక్షత్రాలలో కూడా లగ్నం, గ్రహబలాలు బాగుంటే వివాహానికి అభ్యంతరం లేదు. ఈ విషయం పెద్దలకు చెప్పండి.

*ఎం.అంజనారెడ్డి* — సికింద్రాబాద్

★ *అతనికి అనారోగ్యం. బ్రతుకుతాడనే నమ్మకం లేదు. జీవించడానికి మార్గమేలేదా?*

స్నేహితుడి విషయంలో మీ శ్రద్ధకు వందనాలు. అతనిది వృషభరాశి, శుక్రాధిపత్యం. మద్ది బెరడు కషాయాన్ని ఆయుర్వేద వైద్యుడి పర్యవేక్షణలో ఇవ్వండి. ఉత్తరం రాశాను. అందులో పేర్కొన్న యంత్ర ప్రతిష్ఠ చేయించండి. తప్పక మీ మిత్రుడు జీవిస్తాడు.

*షేక్ ఫరీదాబేగం* — కర్నూలు

★ *మకర రాశి వారి వృక్ష దేవత ఏది? పూజా విధానం చెప్పండి?*

మకర శని అధిష్ఠానం. దేవతా వృక్షం 'శింసుపా'(అశోక). పన్నెండు రోజులు ప్రదక్షిణలు, అరటి నైవేద్యం. భిక్షుక స్త్రీలకు ఆ రోజుల్లో అన్నదానం సకల శుభాల్ని కలిగిస్తుంది. శ్రీవారిని మీరు కలుసుకుంటారు.

*పి.ఆర్.శాస్త్రి* — తిరుమల

★ *భావ ప్రధాన అంశాలు ఎన్ని? అవి ఏవి?*

అంశాలు ఐదు(పంచమం). ద్రేక్కారణ, సప్తాంశ, దశమాంశ, ద్వాదశాంశ, షోడశాంశలు.

*జె.పి.ఆర్* — నెల్లూరు

★ *వివాహ లగ్నాలలో చంద్రునితో రవి రావచ్చునా?*

అలా వస్తే దారిద్ర్యమని శాస్త్రాలు చెబుతున్నాయి. కేతువు వధువుకు దుఃఖాన్ని కుజునితో మరణాన్ని శాస్త్రాలు ప్రస్తావించాయి.

*డాక్టర్ వ్యాస్* — బెంగుళూరు

★ *శుక్ర గ్రహాన్ని గురించి చెబుతారా?*

శుక్రుడు భృగు మహర్షి కుమారుడు. మృత సంజీవని విద్య తెలిసిన వాడు. యూరోపియన్లకు స్త్రీ దేవత. గ్రీకులకు ఏప్రోడైట్ అనే స్త్రీ దేవత. భూమి వ్యాసం 6,371.0 కిలోమీటర్లు అయితే శుక్రుడి వ్యాసం 6051.8 కిలోమీటర్లు. క్రీశ 1609 కెప్లర్ అనే శాస్త్రవేత్త శుక్రుడిని గురించిన విస్తృత సమాచారాన్ని ప్రపంచానికి తెలిపాడు.

*డాక్టర్ శాస్త్రి* — చెన్నై

★ *వివాహ సంబంధాలకు 28 ప్రమాణాలు చూడాలంటారా?*

నాడి, గుణమేళన, లింగం, వర్గు వంటివి శాస్త్రవేత్తల బహుముఖ పరిశోధనలలో నిలువలేదు. నక్షత్రమే ప్రధానం. వధూవరులిద్దరికీ శత్రు నక్షత్రం వస్తే వివాహం మంచిది కాదు.

*జె.శాంభవీరావు* — విజయవాడ

★ *మిథున రాశి వారు, కుంభ రాశి వారని వివాహం చేసుకోవచ్చా?*

రెండు రాశులూ వైశ్య జాతివర్ణ వర్గులోకి వస్తాయి. ఏక జాతి వర్ణ వర్గు శుభస్కరమని శాస్త్రం ఉవాచ.

*వై.రంగారావు* — నెల్లూరు

★ *అపార్ట్‌మెంటు ప్లాటులో వాస్తు సరిచేసుకోవచ్చా?*

కోణ, నిర్మాణ సమస్యలున్నట్లయితే సరిచేసుకోవచ్చు. సరిచేయలేని దోషాలకు 'యంత్రం' సూచించబడుతుంది.

# సిజేరియన్ ఆపరేషన్ల పేరిట దోచేస్తున్న డాక్టర్లు!

**జిల్లాలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో అసలు కాన్పులు చేయడం లేదు. మరో మార్గంలేక ప్రైవేటు ఆసుపత్రులకు కాన్పుల కోసం వెళ్తున్న గర్భవతులను సిజేరియన్ ఆపరేషన్ల పేరిట వైద్యులు దోచేస్తున్నారు.**

నగరంలోని ప్రైవేటు ఆసుపత్రుల నిర్వాహకులు అవసరం లేకున్నా సిజేరియన్ ఆపరేషన్లు చేసి కాన్పులు చేసేస్తున్నారు. కాన్పుల కోసం వచ్చే వారికి ముందుగా సాధారణ ప్రసవం జరుగుతుందని చెప్పి ఆతర్వాత కాన్పు కష్టంగా మారిందని, సిజేరియన్ ఆపరేషన్ చేస్తున్నారు. వైద్యుల హెచ్చరికతో భయాందోళనకు లోనవుతున్న గర్భిణి బంధువులు తప్పనిసరి పరిస్థితిలో అంగీకరించక తప్పడం లేదు. సిజేరియన్ ఆపరేషన్‌కు ఆసుపత్రి స్థాయిని బట్టి 15వేల రూపాయల నుంచి 30వేల రూపాయల వరకు వసూలు చేస్తున్నారు. మధ్యతరగతి, సామాన్య ప్రజలు ప్రైవేటు ఆసుపత్రుల వైద్యుల వలలో చిక్కుకుని ఆర్థికంగా నష్టపోతున్నారు. ఆసుపత్రుల నోటీస్ బోర్డులో ఫీజుల వివరాలు ప్రకటించాల్సి వున్నప్పటికీ ఒక్క రామచంద్రారెడ్డి ఆసుపత్రిలో మినహా మిగిలిన ఆసుపత్రుల్లో ఎక్కడా అమలు కావడం లేదు.

ప్రైవేటు ఆసుపత్రుల్లో బహిరంగంగానే రోగులను దోపిడీ చేస్తున్నా పట్టించుకునే దిక్కు లేకుండా పోయింది. గ్రామీణ ప్రాంతాల్లోని గర్భిణీలు సమీప ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు వెళ్లి వైద్యం చేయించుకోవాల్సి వుంటుంది. అవసరమైతే అక్కడే కాన్పులు కూడా చేసుకోవాలి. కానీ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో వైద్యులు, నర్సులు అందుబాటులో లేకపోవడంతో పట్టణ ప్రాంతాల్లోని ప్రైవేటు ఆసుపత్రులను ఆశ్రయించి వేలాది రూపాయలు చెల్లించుకుంటున్నారు. జిల్లా వైద్య, ఆరోగ్య శాఖ ఆధ్వర్యంలో నిర్వహిస్తున్న పిహెచ్‌సిల్లో తప్పనిసరిగా కాన్పులు జరగాలని ఆ శాఖ అధికారులు జారీ చేసే ఆదేశాలు కేవలం కాగితాలకే పరిమితమై పోయాయి. ఇటీవల జిల్లా కలెక్టర్ శ్రీకాంత్ ఆ శాఖ ఉన్నతాధికారులతో సమీక్షా సమావేశం నిర్వహించి ప్రధానంగా కాన్పుల గురించి ప్రస్తావించడం జరిగింది.

### కలెక్టర్ అసహనం

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో ఏ కారణం చేత కాన్పులు జరగడం లేదన్న విషయాన్ని వెల్లడించాలని డిఎం అండ్ హెచ్‌ఓను కోరడంతో సరైన సమాధానం చెప్పలేక పోయారు. సమీక్షకు వచ్చే ముందు పిహెచ్‌సిల వివరాలు, వైద్యులు, నర్సుల సమాచారంతో రావాల్సి వుండగా అధికారి మాత్రం అరకొర సమాచారంతో రావడం కలెక్టర్ గుర్తించి అసహనం వ్యక్తం చేయడం జరిగింది. పిహెచ్‌సి, కమ్యూనిటీ హెల్త్ సెంటర్ల వివరాలు తనకు అందజేస్తే వాటిని తనిఖీ చేసి నిర్లక్ష్యంగా వ్యవహరించే వారిపై చర్యలు తీసుకుంటానని కలెక్టర్ ప్రకటించడంతో సమీక్షకు హాజరైన వైద్యులు అవాక్కయ్యారు. ప్రభుత్వ ఆసుపత్రులపై సామాన్య ప్రజలకు నమ్మకం లేకపోవడం వల్ల ప్రైవేటు ఆసుపత్రులకు వెళుతున్నట్లు ఈ సందర్భంగా వ్యాఖ్యానించారు కలెక్టర్.

నెల్లూరు నగరంలో జిల్లా ప్రభుత్వ ప్రధాన వైద్యశాల, జూబ్లీ మెటర్నిటీ ఆసుపత్రుల్లో ఉచితంగా కాన్పులు చేస్తారు. అయితే నర్సులు, వైద్యులు రోగుల పట్ల చిన్నచూపుతో వ్యవహరిస్తున్నారన్న విమర్శలు వున్నాయి. సేవాభావంతో విధులు నిర్వహించాల్సిన ఆసుపత్రి సిబ్బంది కొంత దురుసుగా ప్రవర్తించడం పట్ల నిత్యం గొడవలు జరుగుతూ వుంటాయి. అంతేకాకుండా వైద్యం అందించడంలోనూ కొంత నిర్లక్ష్యంగా వుంటారన్న అపవాదు కూడా వుంది. వీటిని ఏ అధికారి కూడా నియంత్రించలేక పోతుండడం విశేషం. ఇటువంటి సంఘటనలతో విసుగు చెందిన వారు ప్రైవేటు ఆసుపత్రులకు వెళుతున్నారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారం రోగుల నుండి వసూలు చేసే ఫీజుల వివరాలను నోటీసు బోర్డులో ప్రకటిస్తే తెలుసుకుని, వైద్యం చేయించుకునే అవకాశం వుంటుంది. అలాగే అవసరం లేకున్నా సిజేరియన్ ఆపరేషన్లు నిర్వహించి కాన్పులు చేసి వేలాది రూపాయలు వసూలు చేస్తున్న ఆసుపత్రులపై చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.

పేద ప్రజలకు వైద్యం అందించేందుకు ప్రభుత్వం కోట్ల రూపాయలు వ్యయం చేస్తున్నప్పటికీ ప్రభుత్వ లక్ష్యం మాత్రం నెరవేరకుండా పోతోంది. వైద్య, ఆరోగ్య శాఖను మరింత బలోపేతంచేసి ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో కాన్పులు జరిగే విధంగా కృషి చేయాల్సిన బాధ్యత ఆ శాఖ అధికారులదని చెప్పక తప్పదు.

మార్కెటింగ్ శాఖ మాయాజాలం

## ● వింజమూరు

# చెక్‌పోస్టులో మామూళ్ల దందా!

- వింజమూరు వ్యవసాయ మార్కెటింగ్ చెక్‌పోస్ట్‌లో విధులు నిర్వహించే సిబ్బంది అవినీతి అక్రమాలకు పాల్పడుతున్నారు.
- ఈ చెక్‌పోస్ట్ మీదుగా వెళ్లే ప్రతి వాహనాన్ని ఆపి మామూళ్లు వసూలు చేయడం రివాజుగా మారింది.

వింజమూరు చెక్‌పోస్టులో మామూళ్ల దందా కార్యక్రమం నిర్విరామంగా కొనసాగుతోంది. ఇక్కడ ఏర్పాటు చేసిన వ్యవసాయ మార్కెటింగ్ చెక్‌పోస్టులో విధులు నిర్వహించే సిబ్బంది అవినీతి, అక్రమాలకు పాల్పడుతున్నా ఎవరు పట్టించుకోవడం లేదు. ఈ చెక్‌పోస్టు మీద వెళ్లే ప్రతి వాహనాన్ని నిలిపి తనిఖీల పేరుతో ఇబ్బంది పెడుతున్నారు. వాస్తవంగా వ్యవసాయ సీజన్‌లో ధాన్యాన్ని తరలించే సమయంలో సెస్సు వసూలు చేస్తుంటారు. ప్రస్తుతం జిల్లాలో వ్యవసాయ పనులు ఇంకా ప్రారంభం కాలేదు. ఈ నేపథ్యంలో వ్యవసాయ మార్కెట్ కమిటీ చెక్‌పోస్టులో సిబ్బంది బలవంతపు వసూళ్లకు పాల్పడుతూ విమర్శల పాలవుతున్నారు. ఈ విషయమై ఎవరైనా ప్రశ్నిస్తే దురుసుగా ప్రవర్తిస్తున్నారంటూ వాహనదారులు వాపోతున్నారు. వ్యవసాయ మార్కెట్ కమిటీకి సంబంధం లేని వాహనాలను సైతం నిలిపి మామూళ్లు వసూలు చేస్తుంటారు.

జిల్లావ్యాప్తంగా ప్రభుత్వ శాఖల అధికారులు, సమైక్యాంధ్ర ఉద్యమంలో భాగంగా సమ్మెలో వుంటున్నారు. ఇదే అదనుగా భావించిన చెక్‌పోస్టు సిబ్బంది చేతివాటం ప్రదర్శిస్తున్నారు. వింజమూరు జిల్లా కేంద్రానికి చాలా దూరంగా వుండడంతో ఎసిబి అధికారులు నిఘా పెట్టలేక పోతున్నారు. అధికారుల పర్యవేక్షణ లేకపోవడం, సమైక్యాంధ్ర సమ్మె కొనసాగడం ఇక్కడ సిబ్బందికి కలిసి వస్తున్నాయి. నిఘా కొరవడడంతో సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు. చెక్‌పోస్టు సిబ్బంది పని తీరును పర్యవేక్షించే బాధ్యత ఆ శాఖ అసిస్టెంట్ డైరెక్టర్‌కు వుంటుంది. ఛైర్మన్ పర్యవేక్షణలో మార్కెట్ కమిటీ శాఖ పనిచేసేది. ఛైర్మన్ అజమాయిషీ వుండడం, అప్పుడప్పుడు రాజకీయ జోక్యం చోటు చేసుకోవడంతో ఆ శాఖ సిబ్బంది పనితీరుపై పర్యవేక్షణ కొరవడింది. అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటున్న వారిపై ఉన్నతాధికారులు ఏదైనా చర్య తీసుకొంటే క్షణంలో రాజకీయ నేతల నుండి ఫోన్లు వస్తుంటాయి.

వ్యవసాయ మార్కెట్ కమిటీకి చెల్లించాల్సిన పన్నులను మాత్రమే చెక్‌పోస్టులో వసూలు చేయాలన్న నిబంధన వుంది. కాని సిబ్బంది మరో అడుగు ముందుకేసి కొబ్బరి బోండాలను తీసుకెళుతున్న ఆటోల నుంచి కూడా మామూళ్లు డిమాండ్ చేస్తున్నారంటే ఇక్కడ పరిస్థితి ఎలా వుందో అర్థం చేసుకోవచ్చు. ఈ చెక్‌పోస్టు మీదుగా కావలి నుండి నిత్యావసర సరుకులు ప్రతిరోజూ రవాణా అవుతుంటాయి. సరుకుల్ని తీసుకెళ్లే వాహనాలను నిలిపి వివిధ రకాలుగా తనిఖీలు చేసి చివరకు ఎంతోకొంత నగదు తీసుకొని వదిలేస్తుంటారు. అలాగే వింజమూరు, దుత్తలూరు మండలాల నుండి బొగ్గు రవాణా చేస్తుంటారు. బొగ్గును తీసుకెళ్లే వాహనాల నుండి మాత్రం నెలసరి మామూళ్లు తీసుకొంటారన్న ఆరోపణలు వున్నాయి. వాహనాల నుండి మామూళ్లు తీసుకొనే సమయంలో ఎటువంటి జంకు, బొంకు లేకుండా జేబుల్లో వేసుకొంటుంటారు. బహిరంగంగా జరుగుతున్న ఈ వ్యవహారాన్ని కళ్లార చూసిన సామాన్య ప్రజలు ఆశ్చర్యపోక తప్పడం లేదు. కొన్ని సందర్భాల్లో రైతుల నుండి ధాన్యం కొనుగోలు చేసి తీసుకెళుతున్న వాహనాలను వదిలేస్తుంటారు. వ్యాపారులతో కుమ్మక్కై వ్యవసాయ మార్కెట్ కమిటీకి రావాల్సిన ఆదాయానికి గండికొడుతుంటారన్న ప్రచారం వుంది. ఆ శాఖ ఉన్నతాధికారులు స్పందించి వింజమూరు చెక్‌పోస్టుతోపాటు మిగిలిన ప్రాంతాల్లో వున్న అన్నీ చెక్‌పోస్టుల్లో విధులు నిర్వహించే సిబ్బందిపై నిఘా పెట్టాల్సిన అవసరం వుంది. లేకుంటే ఈ శాఖ పరువు బజారున పడి, ప్రభుత్వ ఖజానాకు తీవ్ర నష్టం జరిగే ప్రమాదం వుందన్న విషయాన్ని గుర్తించాలి.



## ప్రణీతకు మరో ఛాన్స్!

అత్తారింటికి దారేది చిత్రంలో అందరి దృష్టినీ ఆకర్షించింది రెండవ హీరోయిన్ ప్రణీత. పవన్ కళ్యాణ్ సరసన ఈ అమ్మడు ఒదిగిపోయిన విధానం అందరికీ నచ్చింది. ఆ మాటకొస్తే... సమంత కంటే ఎక్కువ మార్కులు ప్రణీతకే పడ్డాయి. అమ్మో బాపు గారి బొమ్మో అంటూ సాగే పాటలో ప్రణీత అందం అదిరిపోయింది. దీంతో ప్రణీతకు ప్రత్యేకమైన గుర్తింపు లభించింది. పవన్‌తో ఆడిపాడాక ప్రణీత దశ కూడా తిరిగిందంటున్నాయి తెలుగు సినీ వర్గాలు. ఇటీవల ఆమెకు అవకాశాలు వెల్లువెత్తుతున్నాయి. పవన్‌కళ్యాణ్ ఆమెకు తన చిత్రంలో మరోసారి నటించే ఛాన్స్ ఇచ్చాడట. గబ్బర్‌సింగ్ –2లో హీరోయిన్ అచ్చం తెలుగమ్మాయిలా కనిపించాలట. ఆ పాత్ర కోసం ప్రణీత అయితేనే బాగుంటుందని చిత్ర బృందం భావిస్తోందట. ప్రస్తుతం ఆ విషయం పైనే చర్చలు సాగిస్తున్నారు.

## పెళ్లా... యూ సిల్లీ!



బాలీవుడ్‌లో బెస్ట్ బ్రహ్మచారిణి అవార్డు ఇస్తే... అది కచ్చితంగా మల్లికా షెరావత్‌ను వరించేస్తుంది. ఎందుకంటే చాలాకాలం నుంచి ఒంటరిగానే ఉంటుంది. ఒకప్పుడు బాలీవుడ్‌లో హాట్ మిర్చిలా కనిపించి యువ హృదయాలను దోచేసింది. జాకీచాన్‌తో నటించి అంతర్జాతీయంగా పేరు సంపాదించింది. ఇమ్రాన్ హష్మీతో మర్డర్‌లో హాట్‌గా కనిపించి, మరిన్ని చిత్రాలు దక్కేలా చూసుకొంది. ఈ మధ్య పలు టీవీషోలు కూడా చేస్తుంది. ఎలాంటి పెళ్లి కొడుకు కావాలంటే... అప్పుడే పెళ్లా? యూ సిల్లీ అంటూ సమాధానం దాటేస్తుంది.



## ఐటమ్‌గర్ల్‌ను కాను!

సినీ పరిశ్రమలో బోలెడు విచిత్రాలు జరుగుతుంటాయి. హంసా నందిని సినీ జీవితం కూడా అంతే. అనుమానాస్పదం చిత్రంతో పరిశ్రమకు పరిచయం అయ్యింది. ఆతర్వాత కొన్ని సినిమాల్లో నటించినా మిర్చి సినిమాలో ఆమె నర్తించిన మిర్చి మిర్చి మిర్చి మిర్చిలాంటి కుర్రాడే... పాట మంచి పేరు తీసుకొచ్చింది. దీంతో అత్తారింటికి దారేది, రామయ్యా వస్తావయ్యా, భాయ్ చిత్రాల్లో ప్రత్యేక గీతాల్లో నర్తించే అవకాశం వచ్చింది. ఇదే విషయాన్ని ఆమె వద్ద ప్రస్తావిస్తే సమాధానంగా ఐటమ్ గర్ల్ అనే మాటని ఎప్పుడో మరిచిపోయాం. స్పెషల్ అప్పీరెన్స్ అంటున్నాం. అందుకు తగ్గట్టుగానే ప్రత్యేక గీతాలను తెరకెక్కిస్తున్నారు. అయినా ఇప్పుడు కథానాయికలంతా ప్రత్యేక గీతాల్లో ఆడిపాడేస్తున్నారు కదా? బాలీవుడ్‌లో కత్రినాకైఫ్, కరీనా కపూర్‌లాంటి టాప్ హీరోయిన్లే ప్రత్యేక గీతాల్లో నర్తిస్తున్నారు. వాళ్లను ఎవరూ ఐటమ్‌గర్ల్స్ అనడం లేదు కదా? హీరోయిన్ అంటే ఏదో కొన్ని పాత్రలకే పరిమితమవ్వాలనే నియమమేమీ లేదు. నటికి హద్దులు చెరిగిపోయాయి. ఏ రకంగానైనా ప్రేక్షకులకు వినోదం పంచొచ్చని చెప్పుకొచ్చింది.

## కథల వేటలో రామ్‌చరణ్

తుఫాన్ సినిమా ఫలితం తర్వాత ఆచితూచి నిర్ణయాలు తీసుకొంటున్నాడు హీరో రామ్‌చరణ్. ఇప్పటివరకూ ఆయన నటించే చిత్రమేదీ అధికారికంగా ప్రకటించ లేదు. బాలీవుడ్‌లో సల్మాన్ నిర్మాతగా ఓ చిత్రంలో నటిస్తాడని మాత్రం చెప్పుకొంటున్నారు. మరోవైపు మల్టీ స్టారర్ చిత్రం 'త్రయం'లో చెర్రీ నటిస్తాడనే ప్రచారం జోరుగా సాగుతోంది. దీనిలో వెంకటేష్ మరో హీరో. ఈ చిత్రానికి కృష్ణవంశీ దర్శకత్వం వహిస్తారు. అయితే ఇప్పటి వరకు త్రయం కథ ఓకే కాలేదని ఫిల్మ్ నగర్ టాక్. ప్రస్తుతం కథపై కృష్ణవంశీ కసరత్తులు చేస్తున్నాడని సమాచారమ్. మరి ఆ కథ ఎప్పుడు పూర్తవుతుందో ఎప్పుడు ఈ సినిమా సెట్స్ పైకి వెళ్తుందో?



## సిక్స్ ప్యాక్ సుధీర్



ప్రేమ కథా చిత్రమ్‌తో విజయాన్ని అందుకొన్నాడు సుధీర్ బాబు. ఆడు మగాడ్రా బుజ్జీ, మాయదారి మల్లిగాడు సినిమాల్లో ఆయన హీరోగా నటిస్తున్నాడు. ఆడు మగాడ్రా బుజ్జీ చిత్రీకరణ పూర్తవుతుంది. ఈ సినిమా కోసం సుధీర్‌బాబు సిక్స్ ప్యాక్ చేశారు. అంతే కాదు ఫైట్స్‌లో డూప్ లేకుండా నటించారు. దీనితో పాటు కొన్ని పోరాట సన్నివేశాలను స్వయంగా రూపొందించారు. స్వతహాగా సుధీర్‌కు మార్షల్ ఆర్ట్స్‌లో ప్రవేశం ఉంది. యాక్షన్ ఘట్టాలంటే ఆయనకు బాగా ఇష్టం. అందుకే వాటిని ఆయనతో రూపొందించామంటున్నాడు దర్శకుడు కృష్ణారెడ్డి గంగదాసు.



### కామెడీగా

# దూసుకెళ్తా!

✍ అల్లూరు రహీం

విలక్షణ నటుడు మోహన్‌బాబు కుమారుడు మంచు విష్ణు పరిశ్రమలో హీరోగా రంగ ప్రవేశం చేసి ఈ యేడాదితో పదేళ్లు పూర్తవుతాయి. విష్ణు తొలి చిత్రం పేరు విష్ణు. ఈ సినిమా అంతగా ఆడలేదు. కాని విష్ణులోని నటుడ్ని దర్శకుడు శ్రీనువైట్ల 'ఢీ' సినిమాతో బయటకు తెచ్చాడు. ఏ నటుడైనా స్టార్‌గా ఎదగడానికి దర్శకుడే కారణం. మంచి నటుడవ్వడానికి మంచి దర్శకుని చేతిలో పడాలి. విష్ణు ఈ ఏడాది ప్రథమార్థంలో వివాదాస్పద చిత్రం దేనికైనా రెడీలో నటించాడు. ఈ చిత్ర దర్శకుడు నాగేశ్వర్‌రెడ్డి కూడా విష్ణులోని కామింగ్ టైమింగ్‌ను మెరుగు పెట్టాడు. బిందాస్‌తో మంచి దర్శకునిగా గుర్తింపు పొందిన వీరు పోట్ల కథ, మాటలు, దర్శకత్వ బాధ్యతలు కూడా నెరిపిన చిత్రం దూసుకెళ్తా. ఈ సినిమా ఢీ, దేనికైనా రెడీ బాటలోనే సాగుతుంది. ఫ్యామిలీ సెంటిమెంట్, యాక్షన్, పాటలు, మాటలు, వీటన్నింటిని మించి కామెడీ కడుపుబ్బా నవ్విస్తుంది. కామెడీ చిత్రాలకు స్క్రీన్‌ప్లే వ్రాయడంలో గోపీ మోహన్ పేరుగాంచారు. దూసుకెళ్తాకు వీరు వ్రాసిన స్క్రీన్‌ప్లే ఈ సినిమా విసుగనిపించకుండా చూసేలా చేస్తుంది. విష్ణు, బ్రహ్మానందం, హేమ, పోసాని, వెన్నెల కిరణ్, రఘుబాబు, భరత్ కామెడీని పండించడంలో పోటీ పడి మరీ నటించారు. అయితే నూటికి నూరు మార్కులు వేయాలంటే వెన్నెల కిషోర్ పోషించిన పిచ్చేశ్వరరావు పాత్రకు వేయక తప్పదు. రవితేజ వాఖ్యానం, ఒక పాటలో గెస్ట్‌గా మంచులక్ష్మి కనపడడం బాగుంది. చాలా రోజుల తర్వాత మణిశర్మ దూసుకెళ్తా, చూద్దాం, అలేఖ్య, తాండవం ఆడే శివుడు పల్లవులతో సాగే పాటలకు మంచి సంగీతమందించాడు. అయితే పాటలను దర్శకుడు శ్రద్ధ పెట్టి తీయలేదు. అద్భుత లొకేషన్లను ఎంతో అందంగా చూపించే కెమెరామెన్ సర్వేష్ మురారిని కూడా దర్శకుడు బాగా వాడుకోలేదు. హీరోయిన్‌గా లావణ్య త్రిపాఠి కాకుండా మరో హీరోయిన్‌ను పెట్టి ఉంటే ఈ చిత్రం ఇంకా గ్లామర్ తళుకు లీనేది. వీరూ పోట్లనే వ్రాసిన మాటల్లో అబ్బాయిలను వెయిట్ చేయించే అమ్మాయిలకు వెయిట్ ఎక్కువ. మనసుకు దగ్గరైన వాటిని మనీతో విలువ కట్టలేం. ఎలా పుడతామో మన చేతుల్లో వుండదు. ఎలా చస్తామో మన చేతుల్లోనే వుంటుంది. గేదెలు లేని ఊరు, బాధలు లేని మనిషి వుండడు ఆలోచింపజేస్తాయి.

చిత్రకథలోనికి వెళ్తే పిచ్చేశ్వరపురంలో మకుటంలేని మహారాజు పిచ్చేశ్వరరావు (కోట శ్రీనివాసరావు). ఆయన తమ్ముడు (నాగినీడు). వీరిది చాలా పెద్ద కుటుంబం. నాగినీడు కుమారుడు సర్వేశ్వరరావు (రావు రమేష్)కు పెళ్లి చేయాలని ఆ కుటుంబం భావించగా అతను పదేళ్ల క్రితం పెళ్లి చేసుకొన్న తన భార్యాబిడ్డలను పిచ్చేశ్వరరావు ముందుకు తీసుకొస్తాడు ఆయన. గుణం కన్నా కులం గొప్పదని సర్వేశ్వరరావు భార్యాబిడ్డలను తెలివిగా ఇంటి నుంచి పంపేస్తాడు. సర్వేశ్వరరావు కుమార్తె అలేఖ్య(లావణ్య త్రిపాఠి) అంటే ఆ గ్రామంలోని గోపాలరావు(ఆహుతి ప్రసాద్) కుమారుడు చిన్నా(విష్ణు)కు ఎంతో ఇష్టం. పిచ్చేశ్వరరావు మనుమడు పిచ్చేశ్వర్ (వెన్నెల కిషోర్)తో చిన్నా పెట్టుకొనే పందెంలో అతను ఓడిపోయి ఊరి నుంచి వెళ్లిపోతాడు. ఈ విషయం తెలిస్తే తమను ఎక్కడ పిచ్చేశ్వరరావు ఎక్కడ చంపేస్తాడోన్న భయంతో గోపాలరావు కుటుంబం గ్రామం వదలి వెళ్లిపోతూంది. కాలచక్రం గిర్రున తిరిగి పిచ్చేశ్వరరావు కుమారుడు ఢిల్లేశ్వరరావు (పంకజ్ త్రిపాఠి) కేంద్ర మంత్రి అవుతాడు. ఛానల్ రెండున్నరలో రిపోర్టర్‌గా సెలెక్ట్ అవుతాడు చిన్నా. అలేఖ్య డాక్టరవుతుంది. ఒక స్టింగ్ ఆపరేషన్‌కు చిన్నాను పంపుతాడు అతని రీజినల్ హెడ్ అవతారం(పోసాని కృష్ణమురళి). ఈ న్యూస్ ఢిల్లేశ్వరరావును ఇబ్బంది పెట్టేది. ఢిల్లేశ్వరరావు రౌడీలు చిన్నా వెనుకబడి చావగొట్టి పడేసి వెళ్లగా అతడ్ని అలేఖ్య ఆస్పత్రిలో చేర్పిస్తుంది. అప్పటి నుంచి చిన్నా ఆమె వెనుకబడి దగ్గరైపోతాడు. ఆస్తి కోసం ఢిల్లేశ్వరరావు అలేఖ్యను చంపాలనుకొంటాడు. అలేఖ్య, చిన్నాలకు తాము చిన్ననాటి స్నేహితులమని తెలిసిపోతుంది. ఇద్దరూ కలసి పిచ్చేశ్వరపురం వెళ్తారు. పిచ్చేశ్వరరావుతోపాటు ఆ కుటుంబంలోని ఘటాలన్నింటి మనసులను మార్చేస్తారు. ఈ కథలో పానకంలో పుడకల్లా వీరబ్రహ్మం (బ్రహ్మానందం), సంధ్యా (హేమ), రంగన్న (భరత్), గురుమూర్తి (రఘుబాబు) వస్తారు. పిచ్చేశ్వరరావు కుటుంబంలో సమస్యలన్నీ తీరడంతో చిత్రం పరిసమాప్తమవుతుంది. చిత్రకథను మరింత మెరుగుపరిస్తే దూసుకెళ్తా చిత్రం నిజంగానే దూసుకెళ్లేది.

చిత్ర సమీక్ష

# విధుల్లో ఉద్యోగులు!

**✦ కళకళలాడిన ప్రభుత్వ కార్యాలయాలు**

ఎన్జీఓలు సమ్మె విరమించారు. గత రెండు నెలలుగా సమైక్యాంధ్రకు మద్దతుగా ఉద్యోగులందరూ చేపట్టిన సమ్మెకు ఎలాంటి ఫలితం లేకుండా ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి నుంచి స్పష్టమైన హామీ లభించకుండానే సమ్మెకు ముగింపు పలికారు. అక్టోబర్ 18 నుండి అన్ని శాఖల ఉద్యోగులు విధులకు హాజరు కాకపోవడంతో గత రెండు నెలలకు పైగా మూతపడి వెలవెలబోయిన వివిధ ప్రభుత్వ కార్యాలయాలు కళకళలాడాయి. రాష్ట్ర విభజనపై కేంద్ర ప్రభుత్వం జులై 30వ తేది ప్రకటించిన నాటి నుంచి సీమాంధ్ర ప్రాంతంలో నిరసనలు, ఆందోళనలు చెలరేగాయి. వివిధ సంఘాలు సమైక్యాంధ్ర ఉద్యమాన్ని పెద్ద ఎత్తున చేపట్టాయి. దాదాపు 80 రోజులకు పైగా సీమాంధ్ర ఉద్యమం ఎగసి పడుతుండగా, అందులో ఎన్జీఓలు 60 రోజుల పాటు ఉద్యమాన్ని నడిపించారు. కేంద్ర ప్రభుత్వ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ సమ్మెకు పిలుపునివ్వడంతో మొత్తం 71 శాఖలకు చెందిన ప్రభుత్వ ఉద్యోగులు విధులకు పోకుండా ఉద్యమంలో నడిచారు. ఆర్టీసి కార్మికులు సమ్మెకు దిగడంతో రవాణా స్తంభించి పోయింది. అయితే కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర విభజనపై దూకుడు పెంచడం ఇతరత్రా కారణాలతో తాత్కాలికంగా సమ్మె విరమిస్తున్నామంటూ ఆర్టీసి కార్మికులు ముందుగా విధులకు వచ్చారు. ఆతర్వాత విద్యుత్ ఉద్యోగులు అదే బాట పట్టారు. చివరకు సమైక్యాంధ్ర ఉద్యమాన్ని ముందుండి నడిపించిన ఎన్జీఓలు సమ్మె విరమించక తప్పలేదు. వివిధ ప్రభుత్వ శాఖల కార్యాలయాలు రెండు నెలలుగా మూతపడడంతో ప్రభుత్వ ఆదాయానికి భారీగా గండి పడింది. కీలకమైన కమర్షియల్ ట్యాక్స్ పది కోట్ల రూపాయల మేర, రవాణా శాఖలు రోజుకు రెండు లక్షలు రెవిన్యూ వచ్చేది. సమ్మె కారణంగా 45 కోట్ల రూపాయలు రిజిస్ట్రేషన్ శాఖకు పెద్ద ఎత్తున గండి పడగా, ఆర్టీసికి 50 కోట్ల రూపాయల నష్టం వాటిల్లింది. ఈ పరిస్థితుల్లో అన్ని శాఖల ఉద్యోగులు తిరిగి విధులకు హాజరవుతుండడంతో తిరిగి కార్యాలయాలు ప్రజలతో కిటకిటలాడుతున్నాయి.



ఉద్యోగులతో కళకళలాడుతున్న కలక్టరేట్‌లోని ఒక విభాగం.

# ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల ప్రక్షాళనకు శ్రీకారం!

**● కలెక్టర్ శ్రమ ఫలించేనా?**



జిల్లాలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ప్రక్షాళన చేసేందుకు జిల్లా కలెక్టర్ శ్రీకారం చుట్టారు. వైద్య, ఆరోగ్య శాఖకు చెందిన అధికారులు, వైద్యులతో మూడు రోజులపాటు చర్చలు జరిగాయి. పిహెచ్‌సిల ప్రక్షాళనకు సంబంధించి తీసుకోవాల్సిన చర్యలు జిల్లా అదనపు జాయింట్ కలెక్టర్ పెంచలరెడ్డికి అప్పగించారు. క్షేత్రస్థాయిలో ఆరోగ్య కేంద్రాలను సక్రమంగా నిర్వహిస్తే ప్రైవేటు ఆసుపత్రులకు వెళ్లకుండా ఇక్కడే వైద్య సేవలు పొందే అవకాశం వుంటుందన్నది కలెక్టర్ అభిప్రాయం. 24 గంటలు పనిచేసే ఆరోగ్య కేంద్రాల్లో షిఫ్ట్ పద్ధతిలో విధులు నిర్వహించేవిధంగా వైద్యులు, సిబ్బంది నియామకం జరపనున్నారు. సిబ్బంది కొరతపై కలెక్టర్ దృష్టికి తీసుకెళ్లడంతో కాంట్రాక్టు ప్రాతిపదికన ఖాళీలను భర్తీ చేసేందుకు ప్రభుత్వం నుండి అనుమతి పొందాలని నిర్ణయించారు. ఆరోగ్య కేంద్రాల పనితీరును పర్యవేక్షించేందుకు జిల్లాస్థాయిలో ఒక అడ్వైజరీ కమిటీ ఏర్పాటుకానుంది. కన్వీనర్‌గా అదనపు జెసి, ఛైర్మన్‌గా డిఎం అండ్ హెచ్‌ఓ సభ్యులుగా పలువురు వైద్యులతోపాటు పిహెచ్‌సి పరిధిలోని ఆయా గ్రామానికి చెందిన సోషల్ వర్కర్ వుంటారు. ప్రతిరోజు ఉదయం 11 గంటలకు సిబ్బంది, వైద్యులు ఎంత మంది విధులకు హాజరయ్యారన్న సమాచారాన్ని ఆన్‌లైన్ ద్వారా సేకరించి కలెక్టర్‌కు అందజేసే బాధ్యత ఈ కమిటీకి ఉంటుంది. ఆరోగ్య కేంద్రాల్లో మౌలిక సదుపాయాలు, తాగునీరు, పారిశుద్ధ్యం, రోగులకు అవసరమైన మందులు పంపిణీ చేయడంలో ఎటువంటి ఇబ్బందులు కల్గకుండా చర్యలు తీసుకోనున్నది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో విధులు నిర్వహించే సిబ్బంది నిర్లక్ష్యంగా వ్యవహరిస్తే సస్పెండ్ చేయడం, లేదా ప్రభుత్వానికి సరెండర్ చేయడం జరుగుతుందని కలెక్టర్ హెచ్చరికలు చేశారు.

# ట్రెజరీలో సందడి!

**✸ పెండింగ్ బిల్లుల కోసం బారులు తీరిన ఉద్యోగులు**

రాష్ట్ర విభజనకు వ్యతిరేకంగా చేపట్టిన రెండు నెలల సమ్మె అనంతరం ప్రభుత్వ ఉద్యోగులు విధుల్లో చేరారు. ఈ రెండు నెలల వ్యవధిలో జిల్లా ఖజానా కార్యాలయంలో అనేక బిల్లులు నిలిచిపోయాయి. పెండింగ్‌లో వున్న బిల్లులతోపాటు ప్రస్తుత బిల్లులు కూడా మంజూరు చేయించుకునేందుకు ఉద్యోగులు ఖజానా కార్యాలయానికి పరుగులు తీస్తున్నారు. నగరంలోని అన్ని ప్రభుత్వ శాఖల నుంచి ఒకేసారి బిల్లులు రావడం మంజూరు చేయాలంటూ సిబ్బంది కోరుతుండడంతో ఖజానా ఉద్యోగులకు పనిభారం అధికమైంది. ఏ శాఖ ముందుగా బిల్లులు సమర్పిస్తే వాటినే మంజూరు చేయాలని అధికారులు చెబుతున్నారు. సమ్మె కాలానికి సంబంధించి ప్రభుత్వం నుండి స్పష్టమైన ఆదేశాలు వస్తేనే తప్ప జీతాలు మంజూరు చేయడం సాధ్యపడదని అంటున్నారు. మునిసిపాల్టీ, పంచాయతీ రాజ్, ఆర్అండ్‌బి, వైద్య ఆరోగ్య శాఖ, పోలీస్ శాఖలకు చెందిన బిల్లులు పెండింగ్‌లో వున్నాయి. ముందుగా పెండింగ్‌లో వున్న బిల్లులను మంజూరు చేస్తే ఆర్థికంగా కొంత గట్టెక్కుతామని ఉద్యోగులు ఆశ పడుతున్నారు. ఖజానా ఉద్యోగులు కూడా సమైక్యాంధ్ర సమ్మెలో వుండడంతో తోటి ఉద్యోగులు అవసరాలు గుర్తించారు. కార్యాలయానికి వచ్చిన బిల్లులను సమగ్రంగా పరిశీలించి ఎటువంటి కొరివి పెట్టకుండా సహకరించాలని పలు శాఖల ఉద్యోగులు కోరుతున్నారు.

# మళ్లీ తుఫాన్ భయం!

**పై-లిన్ వెనుకనే మరో తుఫాన్**

జిల్లాలో మళ్లీ తుఫాన్ భయం పట్టుకుంది. పై-లిన్ తుఫాన్ వస్తుందని భావించి ముందుగా అప్రమత్తంగా వుండాలని ప్రభుత్వం హెచ్చరించినా అధికారుల్లో పెద్దగా స్పందన కానరాలేదు. ప్రస్తుతం బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడి తుఫాన్‌గా మారే అవకాశం వుందని వాతావరణ శాఖ హెచ్చరికలు చేయడంతో ప్రదానంగా తీరప్రాంత గ్రామాల్లో ఆందోళన నెలకొంది. సకల జనుల సమ్మె విరమించి ఇటీవల తిరిగి విధుల్లో చేరిన ప్రభుత్వ శాఖల అధికారులు, సిబ్బంది ముందు జాగ్రత్తలు తీసుకుంటున్నారు. పై-లిన్ తుఫాన్ ప్రభావం జిల్లాపై లేకపోవడంతో ఇటు ప్రజలు, అటు అధికారులు ఊపిరి పీల్చుకున్నారు. ఈ వారంలో మళ్లీ తుఫాన్ వచ్చే ప్రమాదం వుందని సంకేతాలు అందడంతో అధికారులు తీరప్రాంత గ్రామాల్లోని లోతట్టు ప్రాంతాల ప్రజలను సురక్షిత ప్రాంతాలకు తరలించాలని ఆదేశాలు జారీచేశారు. రేషన్ షాపుల్లో అవసరమైన సరుకులను అందుబాటులో వుంచాలని చెబుతున్నారు. కిరోసిన్, బియ్యం, పప్పులు ప్రభుత్వ నిబంధనల ప్రకారం నిల్వచేయాల్సి వుంటుంది. అత్యవసర సమయంలో బాధితులకు ఆహారం సరఫరా చేయాల్సి వస్తే రేషన్ షాపుల నుండి సరుకులు తీసుకుని వంట చేస్తారు. వాయుగుండం ప్రభావంతో జిల్లాలో భారీ వర్షాలు కురుస్తున్నాయి. ఏ క్షణంలోనైనా తుఫాన్ సంభవిస్తే ప్రజలకు ఇబ్బంది కలుగకుండా అన్ని చర్యలు చేపట్టాలని మండల ప్రత్యేకాధికారులను కలెక్టర్ ఆదేశించారు.

# యాంటి రేబిస్ వ్యాక్సిన్ విభాగంలో రెగ్యులర్ వైద్యుడు!

**జాయింట్ కలెక్టర్ చొరవతో నియామకం**

నెల్లూరు నగరంలో రెడ్‌క్రాస్ సొసైటీ ఆధ్వర్యంలో నిర్వహించే యాంటీ రేబిస్ వ్యాక్సిన్ (ఎఆర్‌వి) విభాగంలో రెగ్యులర్ వైద్యుడిని నియమించారు. గతంలో ఒక ఆర్ఎంపి వైద్యుడిగా చెప్పుకొంటున్న వ్యక్తిని నియమించి కుక్క కాటుకు ఇంజక్షన్ వేయించేవారు. అంతర్జాతీయంగా పేరున్న రెడ్‌క్రాస్ సొసైటీలో ఆర్ఎంపి వైద్యం చేయడం విమర్శలు, వివాదాలకు దారి తీసింది. దీనిపై జిల్లా జాయింట్ కలెక్టర్‌కు వివరించడంతో వెంటనే ఆర్ఎంపిని తప్పించి వేరొక వైద్యుడిని నియమించాలని ఆదేశించాడు. రెడ్‌క్రాస్ సొసైటీ మాజీ కార్యదర్శిగా వున్న వ్యక్తి హయాంలో ఆర్ఎంపి నియామకం జరిగింది. ఎఆర్‌వి విభాగానికి వచ్చే రోగులలో కొందరిని మాజీ కార్యదర్శి నిర్వహించే ఆసుపత్రికి పంపేవారు. అక్కడ ఒక ఇంజక్షన్ వేసేందుకు వెయ్యి రూపాయలు ఫీజు తీసుకునేవారు. రోజుకు కనీసం ఐదు మంది రోగులను పంపేవారు. ప్రస్తుతం ఇక్కడకు రోగులను పంపడం మానేయడంతో మాజీ కార్యదర్శి ఆదాయానికి కొంత గండి పడింది. ఎలాగైనా రోగులను రప్పించాలని ప్రయత్నాలు ముమ్మరం చేస్తూ వెన్నెముక, మొహంపైన కుక్క కరిస్తే ఆధునిక పద్ధతుల ద్వారా సూది వేయాలని, ఇందుకు రెడ్‌క్రాస్‌లో అనుభవజ్ఞులైన వైద్యులు లేని కారణంగా తన ఆసుపత్రికి పంపాలని కోరుతున్నాడట. రెడ్‌క్రాస్‌లో 100 రూపాయలకే ఇంజక్షన్ వేస్తుంటే, ఈయన ఆసుపత్రిలో వెయ్యి రూపాయలు తీసుకుంటున్నాడట. మరి అధికారులు దీనిపై ఎలా స్పందిస్తారో వేచి చూద్దాం.

# చదువులెట్లా సాగుతాయి!

ఎన్జీఓలు సమ్మె విరమించడంతో ఉపాధ్యాయులు బడిబాట పట్టారు. రెండు నెలలుగా బడిముఖం చూడని టీచర్లు తిరిగి ఉద్యోగాలకు పోతుండడంతో విద్యార్థులతో సందడిగా వున్నాయి. సమ్మె విరమణ తర్వాత ఉపాధ్యాయులు, రాజీవ్ విద్యామిషన్ సిబ్బంది, ఇతర అధికారులతో జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగం సమావేశం ఏర్పాటుచేసి విద్యార్థులకు ఎలాంటి నష్టం జరగకుండా చూడాలని, రెండు నెలలు సమ్మె వలన పాఠ్యాంశాల బోధనకు కల్గిన నష్టాన్ని పూడ్చేందుకు, విద్యార్థులకు సెలవు దినాల్లోనూ తరగతులు తీసుకోవాలని, పాఠశాలలు తెరవాలని ఆదేశాలు జారీ చేశారు. అలాగే ఇప్పటికే ఆలస్యమైన మూడు నెలల పరీక్షలను నిర్వహించాలన్నారు. అయితే అధికారుల ఆదేశాలు వినడానికి బాగున్నా విద్యార్థుల పరిస్థితి ప్రశ్నార్థకంగా మారింది. సక్రమంగా పాఠశాలలు జరిగితేనే అంతంత మాత్రంగా చదువులు సాగుతున్నాయి ప్రభుత్వ పాఠశాలల్లో. అలాంటిది సమ్మె విరమణ తర్వాత ఉపాధ్యాయులు బడులకు హాజరు కావడంతోపాటు సెలవు దినాల్లో పాఠశాలలు నిర్వహించి బోధన చేయడంపై సర్వత్రా అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. ముఖ్యంగా పదవ తరగతి విద్యార్థుల పరిస్థితి అగమ్యగోచరంగా వుంది. పాఠ్య పుస్తకాలు సరిగా అందక, బోధన జరగక ఇప్పటికే గందరగోళంగా వున్న వారి పరిస్థితి ఉపాధ్యాయులు బడి ముఖం రెండు నెలలు చూడకపోవడంతో ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఒకవైపు ప్రైవేట్ విద్యాసంస్థలకు ధీటుగా ప్రభుత్వ పాఠశాలలను బలోపేతం చేస్తామని, విద్యార్థులను తీర్చిదిద్దుతామని చెప్పే ప్రభుత్వం, ఉపాధ్యాయులు విద్యార్థులకు తమ వల్ల జరిగిన నష్టాన్ని ఎలా భర్తీ చేస్తారో, సెలవు దినాల్లో పాఠశాలలు పెట్టి విద్యార్థులకు ఎంతమేర మేలు చేకూరుస్తారో చూడాల్సి వుంది.

## బ్యాంకింగ్ వ్యవస్థ

16వ పేజీ కొరవ

పేర్కొన్న పది కంపెనీలలో ఒక్క అదానీ, వేదాంత గ్రూపులు తప్ప మరేవీ కనీసం వడ్డీ కట్టే స్థితిలో కూడా లేవు. జీఎంఆర్, జీవికె, ల్యాంకో, ఎస్సార్ వంటి కంపెనీలు సంపాదించే రాబడి వారు కట్టవల సిన వడ్డీలో సగానికి కూడా చాలే పరిస్థితి లేదు. ఇక అప్పులు తిరిగి చెల్లింపు అనేది కలలోని మాట.

### ఈ రాబడి కూడా నిజం కాదు

అయితే ఈ కంపెనీలు చూపుతున్న ఈ మాత్రం రాబడి కూడా నిజమైనది కాదని ఆర్థికవేత్తల అభి ప్రాయం. బ్యాంకులు అప్పులు మంజూరుకు పరిశీ లించే ముఖ్యమైన పత్రం – బ్యాలెన్స్ షీట్. అందులో కంపెనీ వార్షిక టర్నోవర్, లాభం, నికర విలువ, ఆస్తి అప్పుల తేడా వంటి వాటి ఆధారంగా అప్పు ఇస్తాయి. అందుకోసం మన కార్పొరేట్ కంపెనీలు తప్పుడు టర్నోవర్ సృష్టించి, లేని లాభాలు చూపు తున్నారు. సత్యం కంప్యూటర్స్ రామలింగరాజును అన్వేక్షపాటు జైలులో పెట్టి, ఆయన కష్టపడి నిర్మిం చుకొన్న వ్యాపార సామ్రాజ్యాన్ని ప్రభుత్వం స్వాధీ నం చేసుకొన్నది – తాను లేని లాభాలు చూపానని ఆయనే ప్రకటించిన కారణంతో. కానీ సత్యం కం ప్యూటర్స్ మీద జరిపినట్లు ఈ కంపెనీల మీద కూడా సీరియస్ ఫ్రాడ్ ఇన్వెస్టిగేషన్ దర్యాప్తు, ఫోరెన్సిక్ ఆడి ట్‌లను జరిపిస్తే, కళ్లు తిరిగే దగా కథలు కోకొల్ల లుగా వెలికి వస్తాయి. వినడానికి అతిశయోక్తిగా కన్పించవచ్చు కానీ ఈ కంపెనీలలో ఒకటి కూడా నిజమైన రాబడి చూపించడం లేదు. తప్పుడు లెక్క లతో లేని లాభాలు, జరగని టర్నోవర్‌లను బ్యాలెన్స్ షీట్‌లో చూపించి, బ్యాంకులను దగా చేస్తున్నాయి. అందువల్లనే ఒక దశ దాటిన తర్వాత అప్పులు తిరిగి కట్టలేని దుర్గతికి చేరుకొంటున్నాయి.

### రాని బాకీలని చెప్తే దివాలా తీసినట్లు ఒప్పుకోవాలి

ఈ కంపెనీలు తాము తీసుకొన్న అప్పులను తిరిగి కట్టలేవని బ్యాంకులకు బాగా తెలుసు. మన బోటి సామాన్యులు ఒక హౌసింగ్ లోన్ లేదా చిన్న పాటి వ్యాపార లోన్ తీసుకొంటే, మూడు నెలలు వర సగా వడ్డీ కట్టకుంటే ఎన్‌పిఏ (నిరర్థక ఆస్తి) అని ప్రక టిస్తారు. ఒకసారి ఎన్‌పిఏ అని తేల్చిన తర్వాత ఇంటి మీద వసూళ్లకు హింస పెడతారు. తాకట్టు పెట్టిన ఆస్తులు వేలం వేస్తారు. పత్రికలలో ప్రకటనలిస్తారు. క్రెడిట్ రేటింగ్ చెడిందనే సాకుతో మరే బ్యాంకు కూడా మరే అవసరానికీ అప్పు ఇవ్వదు. సిబిఐఎల్ రిపోర్టు సరిగా లేక పోవడం అంటే అప్పుకు అర్హత కోల్పోయినట్లే లెక్క. కానీ ఇన్ని లక్షల కోట్ల రూపా యల అప్పులు ఎగ్గొట్టడానికి సిద్ధంగా వున్న కంపెనీ లలో ఒక్క దానిని కూడా ఎన్‌పిఏ అని ప్రకటించ డానికి ఏ బ్యాంకు కూడా ఇష్టపడడం లేదు. వారా పని చేస్తే, బ్యాంకుకు సంబంధించిన బ్యాలెన్స్‌లో అంత మేరా నికర విలువ తరిగిపోతుంది. అదే జరిగితే బ్యాంక్ ఆర్థికస్థితి పతనమైపోతుంది. తమ బ్యాంకులు దివాలా తీయకుండా కాపాడుకోవడం కోసం బ్యాంకులన్నీ కలిసి ఈ కంపెనీలు మరింత అధికంగా ప్రజల సొత్తు దోచుకోవడానికి సహకరి స్తున్నాయి. ఏ ఏటి కాఏడు ఈ కంపెనీలు వడ్డీ చెల్లించడానికి కొత్త అప్పులు ఇస్తున్నాయి. ఆ అప్పులు తీర్చడానికి మరుసటి సంవత్సరం మళ్లీ అప్పులిస్తున్నాయి. ఇదొక విష వలయం వలె జరిగి పోతూనే వుంది. అందువల్లనే ఈ పది కంపెనీల అప్పుల మొత్తం ఐదేళ్లలో ఏడింతలు పెరిగింది. ఈ ఒక్క సంవత్సరం ఈ పది కంపెనీలు కలిసి దాదాపు 70వేల కోట్ల రూపాయల అప్పులు తీసుకొన్నాయి. ఆ మొత్తంతో వారు కొత్త ప్రాజెక్ట్‌లేమీ కట్టలేదు. పాత అప్పుల చెల్లింపులకు వాడారు.

### నష్టం నూటపాతిక కోట్ల మంది ప్రజలకు...

కొద్ది సంఖ్యలో వున్న కంపెనీల దురాశకు, దగాకోరు తనానికి పరిహారం చెల్లిస్తున్నది – దేశంలో వున్న నూటపాతిక కోట్ల మంది ప్రజలు. చైనా దేశంలో బ్యాంకు వడ్డీ 4.5 శాతం. జపాన్‌లో 2శాతం. ఐరోపా దేశాలన్నీ ఐదు శాతం లోపలే వడ్డీ వసూలు చేస్తున్నాయి. కానీ భారతదేశంలో మాత్రం పరిశ్రమలకు, వ్యాపారాలకు ఇచ్చే అప్పుల మీద బ్యాంకులు 14 నుండి 18 శాతం వరకు వడ్డీ దండుతున్నాయి. అందువల్ల చిన్న పరిశ్రమల వారు చైనా వంటి దేశాలతో పోటీ పడలేకపోతున్నారు. మన దేశంలో మాత్రమే వడ్డీ రేటు ఇంత అధికంగా వుండడానికి కార్పొరేట్ కంపెనీల దగాకోరుతనమే కారణం. వారు లక్షల కోట్లలో అప్పులు తీసుకొని, వాటిని తిరిగి కట్టక పోవడంతో, ఆ భారాన్ని సాధా రణ ప్రజల మీద మోపుతున్నాయి బ్యాంకులు. ఈ మాట ఈ విలేకరి అభిప్రాయం కాదు. రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా డిప్యూటీ గవర్నర్ చక్రవర్తి మాటలివి. కార్పొరేట్ దురాశకు భారతీయులు భారీ మూల్యం చెల్లిస్తున్నారని స్వయంగా ఆయనే ప్రక టించాడు.

### ఈ పాపం ఈ పది కంపెనీలకు పరిమితం కాదు

వడ్డీకి సరిపడా కూడా రాబడి సంపాదించ లేని కంపెనీల సంఖ్య ఈ పదికి పరిమితం కాదు. ఏ కంపెనీ చరిత్ర చూసినా ఇంతేగా కన్పిస్తున్నది. దేశం మొత్తం మీద బ్యాంకులు ఇచ్చిన అప్పులలో 75శాతాన్ని 3300 కంపెనీలు తీసుకొని వున్నా యట. తతిమా 25శాతం మాత్రమే కోట్లాది మంది రైతులు, చిన్న పరిశ్రమల యజమానులు, చిరు వ్యాపారులు తీసుకొన్న అప్పులు. ఈ 3300 కం పెనీలలో ముప్పాతిక భాగం ఇంచుమించు ఇదే స్థితిలో వున్నాయి. వారి అప్పులు మాత్రం ఏటా రెట్టింపు అవుతున్నాయి. రాబడులు మాత్రం పాతా ళానికి పడిపోతున్నాయి.

### ఈ సమస్యకు పరిష్కారం?

అప్పులతో విలాసాలు గడిపే దుర్మార్గ కార్పొ రేట్ యజమానుల పట్ల బ్యాంకులు ఇదే అలసత్వం ప్రదర్శిస్తే మన దేశంలో బ్యాంకింగ్ వ్యవస్థ కుప్ప కూలిపోవడానికి ఎంతో సమయం పట్టదు. బ్యాంకు లలో తమ డబ్బు దాచుకొన్న అమాయక పౌరుల జీవితాలు చిన్నాభిన్నమై పోతాయి. ఈ సమస్యకు పరిష్కారం – బ్యాంకు అప్పులతో ఆటలాడుకొం టున్న కార్పొరేట్ కంపెనీల పట్ల కఠినంగా వ్యవ హరించడం, వారి నుంచి కంపెనీలను స్వాధీనం చేసుకోవడం మాత్రమే. సత్యం కంప్యూటర్స్ వలె ఈ అన్ని కంపెనీలపై సమగ్ర విచారణ జరిపి, బ్యాంక్ అప్పులతో జల్సాలు చేసిన యజమానులను కటక టాల వెనక్కు నెట్టి, వారి కంపెనీలను జాతీయం చేస్తే తప్ప పరిస్థితి బాగుపడదు. అంత సాహసో పేతమైన నిర్ణయం తీసుకొనే మొనగాడు మన ప్రభు త్వాలలో ఒక్కరంటే ఒక్కడు కూడా లేడు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

20వ తేదీ వైకాపా తీర్థం పుచ్చుకొన్నారు. సూళ్లూరు పేటలో నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి నేతృత్వంలో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో పసల పెంచలయ్య పార్టీ మారారు. కాంగ్రెస్ హయాంలో పెంచలయ్య గృహ నిర్మాణ, సమాచార పౌరసంబం ధాల శాఖామంత్రిగా వ్యవహరించారు. ఇప్పటికే పెం చలయ్య అల్లుడు సంజీవయ్య వైకాపా సూళ్లూరుపేట నియోజకవర్గ ఇన్‌ఛార్జ్‌గా పనిచేస్తుండడం విశేషం.

## వైకాపా సేవాదళ్‌లో చింతంరెడ్డి!

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సేవాదళ్ రాష్ట్ర కమిటీ సభ్యునిగా జిల్లాకు చెందిన చింతంరెడ్డి జనా ర్దన్‌రెడ్డి నియమితులయ్యారు. పార్టీ అధినేత వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఆదేశాల మేరకు జనార్దన్‌రెడ్డిని నియమించినట్లు రాష్ట్ర సేవాదళ్ కన్వీనర్ కోటంరెడ్డి వినయ్‌రెడ్డి చెప్పారు. నెల్లూరు సరస్వతినగర్‌కు చెం దిన జనార్దన్‌రెడ్డికి వైఎస్ జగన్ అంటే వీరాభి మానం. జగన్మోహన్‌రెడ్డి చేపట్టిన ఓదార్పు యాత్రలో ఆయన విరివిగా పాల్గొన్నారు.

## గిడ్డంగుల శాఖ డైరక్టర్ కర్రెద్దుల రమేష్ మృతి

బోగోలు మండల కాంగ్రెస్ నేత, రాష్ట్ర గిడ్డం గుల శాఖ డైరక్టర్ కర్రెద్దుల రమేష్(60) అక్టోబర్ 20వ తేదీ మరణించారు. మాజీ ఎమ్మెల్యే కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డికి ముఖ్య అనుచరుడిగా గుర్తింపు పొం దిన రమేష్ కొన్ని నెలల క్రితం గిడ్డంగుల శాఖ డైర క్టర్‌గా పదవి చేపట్టారు. ఆయన అంత్యక్రియల్లో పెద్ద సంఖ్యలో కాంగ్రెస్ పార్టీ కార్యకర్తలు, అభిమానులు పాల్గొన్నారు.

## సవాలు విసురుతున్న జగన్

మొదటి పేజీ కొరవ

మొత్తం జన సమర్ధంగా మారాలని, ఆ జన సమీక రణ చూసి తెలంగాణ వాదులు బిత్తరపోవాలని తల పోస్తున్నాడు జగన్. ఆంధ్ర నుంచి కాక, హైద రాబాదు చుట్టుపక్కల జిల్లాల నుంచి కూడా రెండు మూడు లక్షల మందిని సమీకరించాలని ఏర్పాట్లు చేస్తున్నాడు. రియల్ ఎస్టేట్ ప్రభావం కల్గిన ప్రతి గ్రామానికి తన మనుషులను పంపి, సమైక్య సభకు వస్తే తెలంగాణ ఏర్పాటు నిలిచిపోతుందని, తద్వారా మీ భూములకు మళ్లీ మంచి ధరలు వస్తాయని ప్రచారం చేయిస్తున్నాడు.

ఒక్క మాటలో చెప్పాలంటే ఈ సభను సమైక్య శంఖారావంగా కాక, తెలంగాణ ఉద్యమ ధిక్కార సభగా జరపాలన్నది జగన్ ప్రణాళిక.

మామూలు పరిస్థితులలో అయితే తెలంగాణ వాదులు ఇటువంటి ప్రయత్నాలను తీవ్రంగా ప్రతి ఘటిస్తారు. కానీ వారిప్పుడు పూర్తి సంయమనంతో నడుచుకొంటున్నారు. తాము ఏ మాత్రం తొందర పడినా, ఉద్యమంలో హింసకు అవకాశం ఇచ్చినా, ఆ సాకు చూపించి తెలంగాణ ఏర్పాటును వాయిదా వేస్తారన్నది వారి భయం. క్యాబినెట్ నోట్ కూడా ఆమోదం పొంది, పార్లమెంట్‌లో బిల్లుకు సన్నా హాలు జరుగుతున్న సమయంలో ఎవరు ఎంత రెచ్చ గొట్టినా రెచ్చిపోవడం ఆత్మహత్యా సదృశ్యమౌతుం దన్నది తెలంగాణవాదుల భావన. అందువల్ల జగన్ సభ ఆయన అనుకొన్నట్లే జరుపుకోవడానికి పెద్దగా ప్రతిబంధకాలు రాకపోవచ్చు.

జగన్ నిజంగా ఈ సభను ఈ రీతిలో నిర్వ హించగల్గితే, తెలంగాణలో జగన్‌కు స్థానం లేదు అన్న ప్రచారానికి తెర పడుతుంది. దానివల్ల ఆయ నకు ఆంధ్రాలో కూడా ఉపకారం జరుగుతుంది.

## జెండా ఊపిన సిఎం

మొదటి పేజీ కొరవ

టన చేయాలని కిరణ్ ప్రణాళిక రచించినట్లు ఆయన ఆంతరంగిక మంత్రులు బాహాటంగానే చెప్తున్నారు.

ఈ నేపథ్యంలో, వున్నట్లుండి జడ్పీటిసి, ఎమ్పీ టిసి ఎన్నికల నిర్వహణ నిర్ణయం తీసుకోవడంతో అందరూ అయోమయంలో పడిపోతున్నారు. ఎన్నికల నోటిఫికేషన్ వెలువడితే, ప్రభుత్వ ఉద్యో గులందరూ ఎన్నికల కమిషన్ పరిధిలోకి వెళ్లిపో తారు. వారి నిర్వహణలో పని చేసే సమయంలో సమ్మెలు, ఉద్యమాలు, ఆందోళనలు నిషిద్ధం. సమ్మె నోటీసు కూడా ఇవ్వడానికి లేదు. కేంద్రంలో జరుగుతున్న పరిణామాలను బట్టి నవంబర్ నెల మొదటి వారాలలో తెలంగాణ ఏర్పాటు ముసా యిదా బిల్లు శాసనసభ పరిశీలనకు రానున్నది. ఎన్జీఓలు సమ్మె విరమణ సమయంలో ప్రకటించిన ప్రణాళిక ప్రకారం, బిల్లు శాసనసభ పరిశీలనకు రాగానే మరొకసారి మెరుపు సమ్మె చేయాలను కొన్నారు. కానీ ఎన్నికల నోటిఫికేషన్ విడుదలైతే వారికి ఆ అవకాశం వుండదు. ఎన్జీఓలు సమ్మెకు దిగనిదే సమైక్య ఉద్యమం మరొకసారి రాజేయడం సులభం కాదు. ఉద్యోగులు సమ్మెకు పూనుకో కుండా అడ్డుకోవడానికే కిరణ్ కుమార్‌రెడ్డి ఈ ఎన్నికల ప్రతిపాదన ముందుకు తెస్తున్నాడా అన్నది ఆలోచించవలసిన అంశం.

అదే నిజమైతే ఆయన ఆంతర్యం ఏమిటి? సమైక్య వాద ఛాంపియన్ కావాలనుకొన్నది కేవలం ప్రచారం కోసమేనా? కేంద్ర నాయకత్వం ఆదేశా లకు అనుగుణంగానే ఇంతకాలం ఆయన వ్యవహా రాలు నడిపాడా? ఇప్పుడు కూడా ఆ ఆదేశాలను శిరసావహించి ఎన్నికల ప్రక్రియ ప్రారంభిస్తున్నాడా అన్న సందేహాలు కలుగుతున్నాయి.

నిజానికి రాజకీయపరంగా ఇది స్థానిక ఎన్ని కల నిర్వహణకు తగిన సమయం కాదు. ఈ ఎన్ని కలు పార్టీ గుర్తు మీద జరుగుతాయి. రాష్ట్రంలో కాం గ్రెస్ పరిస్థితి ఎంత అధ్వాన్నంగా వుందో అందరికీ తెలుసు. కరెంట్ బాధలు, అధిక ధరలు, రాష్ట్రంలో దేశంలో కాంగ్రెస్‌వాదుల అవినీతి వంటి అంశాల కారణంగా ప్రజలలో ఆ పార్టీ పట్ల ద్వేషం జనించి వుంది. దానికి రాష్ట్ర విభజన వివాదం కలగలిసింది. ఇప్పుడు ఎన్నికలు జరిపితే కాంగ్రెస్ పార్టీ అభ్యర్థు లకు డిపాజిట్లు అయినా దక్కుతాయా అన్నది. అను మానం. శాసనసభ ఎన్నికలు ఐదు నెలల గడువులో వున్నప్పుడు, రాష్ట్రం మొత్తం పార్టీ తుడిచి పెట్టుకొని పోయింది అనే నిజాన్ని నిర్ధారించబూనుకోవడం రాజకీయంగా ఆత్మహత్యతో సమానం. అటువంటి నిర్ణయానికి ముఖ్యమంత్రి ఎందుకు సిద్ధపడుతు న్నాడో ఎవరికీ అర్థం కావడం లేదు.

## జనవాణి

2వ పేజీ కొరవ

ఇస్తున్నారు. ఈసారి ఎన్నికల్లో ఆనం సోదరులకు ప్రజలు తగిన రీతిలో బుద్ధి చెప్పడం ఖాయం.

సి.సుజాత బుచ్చిరెడ్డిపాళెం

## పదరంగం -90

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | | 3 | 4 | | 5 | | 6 |
| 7 | | | 8 | | | | 9 | | |
| | | 10 | | | 11 | 12 | | | |
| | 13 | | | 14 | | | | 15 | |
| 16 | | | 17 | | 18 | | | | |
| 19 | | | | | | | 20 | | 21 |
| | | 22 | | 23 | | 24 | | | |
| | 25 | | | | | | | 26 | |
| 27 | | | 28 | | 29 | | 30 | | |
| 31 | | | | | 32 | | | | |

**అడ్డం**

1. ఒంటరితనం (3)
3. మూకుమ్మడి (4)
7. స్తుతి, తేలికగా (2)
8. మానవుడు (3)
9. బంగారం, కాంచనం (3)
10. అధికం, ఎక్కువ (2)
11. తడబడిన భూకంపం (3)
13. ధర, ఖరీదు (2)
15. తెలుగు ఫింగర్ (2)
16. కన్య మరో విధంగా (2)
17. పరాయి భర్త కాదు పలుకుబడి (4)
19. రాక్షసకు పింగళకు మధ్య గల తెలుగు సంవత్సరం (2)
20. యముడిని ఎదిరించిన సత్యవంతుని భార్య (3)
22. జంతువు, మనిషి కాదు (3)
24. స్నేహితురాలు (2)
25. మోసం, గడబిడ, తకరా (4)
26. భర్త (2)
27. అటునుంచి విలువైనరాయి (2)
28. అటునుంచి క్రోధము (3)
30. వికృతి తరువాతి తెలుగు సంవత్సరం (2)
31. బలి చక్రవర్తిని పాతాళానికి త్రొక్కిన విష్ణువు (4)
32. పురోగమనం కాదు (5)

**నిలువు**

1. కరి, గజము (3)
2. వెలుగు, వెలుతురు (2)
3. వేశ్య (2)
4. ఎలుక (3)
5. క్రింద నుంచి తెలుగు డిస్ట్రిబ్యూషన్ (3)
6. తమిళ సినిమా ప్రసిద్ధ హాస్యనటుడు (4)
8. బుద్ధి, తెలివి (2)
10. కెరటం (2)
12. రాజు, భూపాలుడు (3)
13. తెలుగు మూన్‌లైట్ (3)
14. తెలుగు కర్టన్ (2)
15. ఎండాకాలం (3)
16. బంగారం, పసిడి (3)
17. భార్గవరాముడు (6)
18. పడటంకు అసమాపకం (2)
20. ఉమర్ ఖయ్యాంకు సారాయి అందించిన వనిత. వత్తు కలిగి వుంది (2)
21. మూడు వందలు (3)
22. పకపకలలో ఒకటి (2)
23. క్రిందనుంచి గౌరవం ప్రతిష్టతో పాటిది (3)
24. శబ్దము (2)
25. క్రిందనుంచి రెండు 'మ'లతో ప్రేమ (3)
26. సూపర్‌లేటివ్ ఎక్స్‌ట్రీం (3)
27. క్రిందనుంచి వాక్కు సరస్వతి (2)
29. వానరం (2)
30. ము లోపించిన ఖగము (2)

**సమాధానాలు**

## పదరంగం -89

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| [1]సా | క | [2]ర్యం | | [3]శ | శాం | [4]కు | [5]డు | | [6]ఆ |
| మి | | [7]కా | [8]ను | క | | [9]శ | త | మా | నం |
| [10]త్రి | [11]మై | | [12]చే | ట | | | అ | | దం |
| | [13]కం | [14]పు | | [15]ము | [16]పా | | | [17]వా | |
| [18]ప | | [19]లు | కా | | [20]ప | సి | [21]వా | డు | |
| [22]క | [23]లు | పు | | [24]తా | | | [25]డ | క | [26]పో |
| [27]ప | చా | | | [28]మ | [29]రో | లో | కం | | కి |
| క | | [30]లం | వా | ర | క | | | [31]క | రి |
| [32]లు | [33]గో | | | [34]పు | లి | గో | రు | | పి |
| | [35]చి | రు | న | వ్వు | | | | [36]క | ల్లి |

# ఆంధ్రులది పురోగమనమా? తిరోగమనమా??

ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాన్ని జరుపుకోబోతున్నాం. "ఊరంతా ఒక్కదారైతే ఉలిపి కట్టెది ఇంకొక దారి" అనే సామెత ఆంధ్రులకు నూటికి నూరు పాళ్లు అన్వర్తిస్తుంది. ఆంధ్రులంతా ఒక్కటిగా ఉండాలని భాషా ప్రయుక్త రాష్ట్రం కోసం సుదీర్ఘ పోరాటం జరిపి చివరకు శ్రీ పొట్టి శ్రీరాములు గారి ఆత్మాహుతితో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. ఆతర్వాత ఆంధ్రులంతా ఒక్కటిగా వుండాలనే తాపత్రయంతో విశాలాంధ్ర పేర ఉద్యమం జరిపి రాష్ట్రాల పునర్విభజన కమిషన్ ద్వారా ఆంధ్రప్రదేశ్‌ను సాధించుకున్నారు. ఈ రాష్ట్రానికి విశాలాంధ్ర అని నామకరణం చేయాలని వామపక్షాలు సూచించాయి గనుక ఆ పేరు వుండడం ఇష్టం లేక అప్పుడు రాష్ట్ర రాజకీయాల్లో చక్రం తిప్పుతూ వుండిన నీలం సంజీవరెడ్డి గారు సూచించిన పేరు ఆంధ్రప్రదేశ్ ఖరారయ్యింది.

ఆంధ్ర రాష్ట్రమైతే ఏర్పడింది గానీ ఆంధ్రులు ఎంత పోగొట్టుకున్నారో ఇప్పటివరకు ఆంధ్ర నాయకులు ఆలోచించక పోవడం శోచనీయం. 11 జిల్లాలు, 3 తాలూకాలతో ఏర్పడింది నిర్దిష్టమైన, నిర్వివాదమైన ఆంధ్ర రాష్ట్రం. ఆ దినం ఆ విధంగా ప్రకటించారు అప్పటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ. ఆంధ్రుల ప్రయోజనాలు కాపాడేవాడు ఒక్కడు కూడా ఆనాడు కేంద్ర ప్రభుత్వంలో లేడు.

నెల్లూరీయుడు డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గెలిచి వుంటే ఎట్లుండేదో! ముఖ్యమంత్రి అయిండేవాడు. ఆంధ్రుల వాణిని వినిపించి వుండేవాడు ఆయనను ఓడించారు. అందువల్ల అప్పటి ఉమ్మడి రాష్ట్ర ముఖ్యమంత్రి రాజగోపాలాచారి ఇష్టాన్నిబట్టి వ్యవహారం నడిచింది. ఆంధ్ర రాష్ట్రానికి తల, తోకా లేకుండా పోయింది. మద్రాసు పట్టణాన్ని బళ్లారి పట్టణాన్ని, కోలారు, మైసూరు, తిరువళ్లూరు, ఉత్తుకోట ప్రాంతాలను పోగొట్టుకున్నాం. వివాదంలేని ప్రాంతాలతో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినప్పటికీ తమిళుల ఒత్తిడికి నీలం సంజీవరెడ్డి గారు షాలింగర్, ఉల్లిపట్టు, రామకృష్ణరాజు లాంటి తెలుగు మాట్లాడే ప్రాంతాలను తమిళనాడుకు ధారాధత్తం చేశారు. అంతటితో ఆగక తమిళుల ఒత్తిడికిలోనై నీలం సంజీవరెడ్డిగారు మళ్లీ తిరుత్తణిని తమిళులకు ధారాదత్తం చేయడం ప్రత్యామ్నాయంగా ఒక్క తెలుగు మాట్లాడే ప్రాంతాన్ని కూడా రాబట్టుకోలేక పోయాం. ఆ తర్వాత రాష్ట్రాల పునర్విభజన కమిషన్ ఏర్పాటైంది. ఫజుల్ ఆలీ గారి అధ్యక్షతన వారి సూచన మేరకు ప్రస్తుత ఆంధ్రప్రదేశ్‌కు హైదరాబాద్ రాజధానిగా ఎంపిక చేశారు.

ఇందులో కూడా ఆంధ్రులకు ఎనలేని అన్యాయం జరిగింది. హోసూరు, హోస్పేట, బళ్లారి, చందా, బసరు, పర్లాకి, మిడి, బరంపురం లాంటి తెలుగు మాట్లాడే ప్రాంతాలు ఆంధ్రప్రదేశ్‌తో కలువకుండా చాలా అన్యాయం జరిగింది. ఆ తర్వాత ఏర్పాటు కాబడిన పఠాస్కర్ గారి కమిషన్ సరిహద్దులు సరిదిద్దేదానికి ఏర్పడింది. అందరూ ఆంధ్రప్రదేశ్‌లో బళ్లారి, మైసూరు, కోలారు, తుంగభద్ర పరివాహక ప్రాంతం కలుపబడతాయని ఆశించారు. కానీ నీలం సంజీవరెడ్డి గారు కోలార్, తుంగభద్ర, బళ్లారి ప్రాంతాలు కర్ణాటకకు ధారాదత్తం చేశారు. అయ్యిందేదో అయిపోయింది. ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటై 56 సంవత్సరాలు అయ్యింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడి 56 సంవత్సరాలు అయ్యింది. ఈ అర్ధ శతాబ్దంలో ఆంధ్రప్రదేశ్ ముందుకు పోయిందా? లేక వెనక్కుపోయిందా? అంటే ప్రక్కనున్న తమిళనాడు, మహారాష్ట్రలతో పోలిస్తే వెనుకబడిందనే చెప్పాలి. దానికి కారణాలు కేంద్రంలో ఆంధ్రులకు ఆధిపత్యం లేకపోవడం ఒక్కటే. రెండవది పి.వి.నరసింహారావు ముఖ్యమంత్రిని దించేందుకు ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కోసం సుమారు రెండు నెలలు రాష్ట్రవ్యాప్తంగా ఉద్యమించడం. మూడవది ముల్కీ నినాదాలతో సర్కారు, రాయలసీమ జిల్లాల వారిని తెలంగాణ నుండి తరిమి వేయాలని ఉద్యమం కొంతకాలం ప్రజ్వరిల్లడం. నాల్గవది మర్రి చెన్నారెడ్డిని దించి వేయడానికి జరిగిన అల్లర్లు, ఐదవది ప్రస్తుతం సాగుతున్న తెలంగాణ రాష్ట్ర సమితి పేర ప్రత్యేక తెలంగాణ కావాలనే కార్యక్రమం.

**సత్యనారాయణ జెట్టి**
ప్రముఖ న్యాయవాది, వెంకటగిరి

దేశంలోనే అతి పెద్ద రాష్ట్రమైన ఉత్తర ప్రదేశ్‌ను పరిపాలనా సౌలభ్యరీత్యా గానీ, ఏ ఇతర కారణాల వల్ల గానీ, ఎవరు గానీ, ఏ పార్టీ వారు గానీ చీల్చాలి అని కోరుకోవడం లేదు. ఎవరైనా కోరుకుంటే వారికి మనుగడ ఉండదు. ఉత్తరప్రదేశ్‌లో ముఖ్యమంత్రిగా ఉత్తర ప్రదేశ్ వాడు తప్ప మరొకరిని అంగీకరించరు. ఉత్తర ప్రదేశ్ వాడు కాకపోతే హిందీ మాట్లాడే ప్రాంతం వాడుగా వుండాలి. లేకపోతే దించేస్తారు. అదే ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యేక తెలంగాణ, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం, ప్రత్యేక రాయలసీమ, ప్రత్యేక సర్కార్లు కోరడం రివాజు అయిపోయింది.

రెండవ యుద్ధానంతరం సమైక్య జర్మనీ ఎప్పటికైనా ప్రపంచానికి ముప్పు అని బోన్ రాజధానిగా పశ్చిమ జర్మనీ, బెర్లిన్ రాజధానిగా తూర్పు జర్మనీలు ఏర్పడ్డాయి. అంతేకాక ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన బెర్లిన్‌గోడ నిర్మించడం జరిగింది. ఆ తర్వాత జర్మనీ వారందరూ ఒక్కటిగా వుండాలనుకున్నారు. సమైక్య జర్మనీ ఏర్పడింది. బెర్లిన్ గోడ రూపురేఖలు కూడా ఇప్పుడు లేవు. అలాగే ఉత్తర కొరియా, దక్షిణ కొరియాలు ఏర్పడి యుద్ధాలు కూడా చేసుకున్నారు. ఇప్పుడు కలిసి పోవాలనుకొంటున్నారు. అలాగే ఉత్తర వియత్నాం, దక్షిణ వియత్నాంలు ఏర్పడి యుద్ధాలు కూడా చేసుకున్నారు. కానీ ఇప్పుడు కలిసి పోవాలనుకొంటున్నారు. అలాగే మలయా, సింగపూర్‌లు ప్రత్యేక దేశాలుగా ఏర్పడి ఇప్పుడు కలిసి పోవాలని ఆలోచిస్తున్నాయి. చైనాను ఆనుకుని వుండిన బ్రిటీష్ వలస రాజ్యమైన హాంగ్‌కాంగ్ చైనాలో విలీనమైపోయింది. చరిత్రంతా కలిసి వుంటే కలదు సుఖం అని చాటుతుంటే మనం మాత్రం విడిపోవాలనుకొంటున్నాం. ఇది తెలుగు వారిలోని ప్రత్యేకత అని అనాలా, లేదా అవగాహనా రాహిత్యం అనాలా అర్థం కావడం లేదు.

ఆంధ్రప్రదేశ్‌గా కొనసాగితే మంచిదే. రెండుగా వీడిపోతే సీమాంధ్ర ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే ఎన్ని కష్టాలు, నష్టాలు వున్నా విజయవాడ రాజధాని కావాలి. క్రితం జరిగిన పొరపాటు పునరావృతం కాకూడదు.



## రైతు లోకం

# నాణ్యమైన విత్తనం కోసం పాటించాల్సిన మెళకువలు!

**గతవారం తరువాయి భాగం**

సార్వా, దాళ్వా వాతావరణ పరిస్థితులకు కాలపరిమితిని బట్టి అనువైన రకాలను సాగు చేయాలి. ఆ విధంగా చేస్తే రకాల్లో లక్షణాలు ప్రస్ఫుటంగా వ్యక్తీకరింపబడతాయి.

విత్తనోత్పత్తి సారవంతమైన, మంచినీటి వసతి వున్న పొలాల్లోనే చేపట్టాలి. లేకపోతే విత్తన నాణ్యత దెబ్బతినే అవకాశముంది.

విత్తనోత్పత్తి అంతకు ముందు పంట కాలంలో అదే రకం వేసిన పొలంలో లేదా వేరే పంట వేసిన పొలంలో సాగు చేయడం వల్ల, స్వయం ఉత్పత్తి మొలకల వల్ల కల్తీ జరగకుండా జాగ్రత్త పడవచ్చు.

విత్తనోత్పత్తి చేసే పొలం చుట్టూ అదే పంటకి చెందిన వేరే రకం వుంటే కనీసం 3 మీటర్ల అంతర దూరం పాటించాలి.

**డాక్టర్ వై.సూర్యనారాయణ**
ప్రధాన శాస్త్రవేత్త,
వ్యవసాయ పరిశోధనా స్థానం, నెల్లూరు.

నారుమడిని పోసేటప్పుడు నేలను బాగా దున్ని, కలుపు లేకుండా చేసి, నారు పెట్టడానికి, తీయడానికి వీలుగా కాలువలు ఏర్పాటు చేసుకోవాలి.

నారుమడిలో పశువుల ఎరువు, పచ్చిరొట్ట పైర్లు పెంచి భూమిలో కలియదున్నాలి. దుక్కిలో సిఫార్సు చేసిన నత్రజనిలో సగభాగం, మొత్తం భాస్వరం, పొటాష్‌లను వేసిన తరువాత రెండో భాగం నత్రజనిని విత్తిన 12-15రోజుల మధ్య పైపాటుగా వేయాలి.

నాట్లు వేసేటప్పుడు 25-30 రోజుల వయస్సు గల నారును, రకాల కాలపరిమితిని బట్టి నాటాలి.

కుదురుకు 2-3 మొక్కల చొప్పున పైపైన నాటాలి. దీర్ఘకాలిక రకాలైతే చదరపు మీటరుకి 33 కుదుర్లు, స్వల్పకాలిక రకాలైతే 44 కుదుర్లు వుండేలా చూడాలి.

(కొరవ వచ్చే వారం)

# భారతీయ బ్యాంకింగ్ వ్యవస్థ దివాలా తీయబోతుందా?

## పది కంపెనీల దగాకోరుతనం వల్ల ఆరు లక్షల కోట్ల రూపాయలు హారతి కర్పూరమైపోయాయి.

రూపాయి విలువ పడిపోయింది.

ధరలు అమాంతం పెరిగిపోతున్నాయి.

ఎరగడ్డ కిలో వంద రూపాయలు పలుకుతున్నది.

బ్యాంకుల వడ్డీ రేట్లు రోజురోజుకూ పెరిగిపోతున్నాయి.

కాబూలీ వడ్డీ లెక్కను తలపిస్తున్నాయి.

అంత వడ్డీకి సిద్ధపడినా చిన్న పరిశ్రమలకు, చిరు వ్యాపారులకు బ్యాంకులు అప్పులు ఇవ్వడం లేదు.

ఒకవేళ ఇచ్చినా ఒకటికి రెండింతలు ఆస్తి తాకట్టు పెట్టమంటున్నాయి. అది కూడా నగరాలలోని భవనాలే కావాలని, గ్రామాలలో పొలాలు వద్దనే వద్దని ఖరాఖండిగా చెప్తున్నాయి.

చిన్న చిన్న వ్యాపారులు ఒక్క నెల అప్పుకు వాయిదా చెల్లించలేకపోతే, బ్యాంకు ప్రతినిధులు ఇళ్లకు వస్తున్నారు. హింసపెడుతున్నారు. 60 రోజుల వ్యవధి ఇచ్చి ఆస్తులు జప్తు చేస్తున్నారు.

క్రెడిట్ రేటింగ్ పేరుతో అప్పుకు అనర్హులని తీసి పక్కన పారేస్తున్నారు.

బంగారు నగలు కుదువ పెట్టినా సకాలానికి వడ్డీ కట్టలేదని వేలం పెట్టేస్తున్నారు.

పంట రుణాలు అడిగితే రైతులను దొంగల వలె చూస్తున్నాయి బ్యాంకులు.

ఇవన్నీ చూస్తే ఏమనిపిస్తుంది? మన బ్యాంకులు ఎంత క్రమశిక్షణతో నడుస్తున్నాయి. అప్పులివ్వడంలో ఎన్ని జాగ్రత్తలు తీసుకొంటున్నాయి. వాటిని తిరిగి వసూలు చేయడంలో ఎంత కఠినంగా వ్యవహరిస్తున్నాయి... అనే సదాభిప్రాయం కలగడం సహజం.

కానీ ఇది పైకి కన్పించే మాయ. ప్రజలను మోసం చేసే పచ్చి దగా. మన బ్యాంకులు చేస్తున్న పని – అవసరం కోసం అప్పు అడిగే వాడిని నానా అవస్థలకు గురి చేయడం మాత్రమే. దేశాన్ని దోచే దుర్మార్గులకు, బందిపోటు దొంగలకంటే హీనమైన పారిశ్రామికవేత్తలకు మన బ్యాంకులు వూడిగం చేస్తున్నాయి. ఒకరితో ఒకరుగా పోటీ పడి మరీ ఆ పిండారీలకు సర్వం దోచి పెడుతున్నాయి. ఆధారం లేకుండా ఆవేశంతో, కడుపు మంటతో చేసే ఆరోపణ కాదిది. నిఖార్సైన నిజం.

మన దేశంలోని పదంటే పది కార్పొరేట్ కంపెనీలు తీసుకొన్న అప్పులు – 6 లక్షలా 31వేల కోట్ల రూపాయలు. దేశంలోని బ్యాంకులన్నీ కలిసి ఇచ్చిన అన్నిరకాల అప్పుల మొత్తంలో ఇది 15 శాతం. అంతకంటే దారుణమైన విషయం ఏమిటంటే, భారతీయ బ్యాంకింగ్ వ్యవస్థ మొత్తం నెట్ వర్త్ (నిఖర విలువ)లో ఈ పది కంపెనీలు తీసుకొన్న అప్పులు 98 శాతంతో సమానం. అంటే ఏ కారణం వల్లనైనా ఈ పది కంపెనీలు తాము తీసుకొన్న అప్పులను చెల్లించలేని స్థితి ఏర్పడితే దేశంలోని అన్ని బ్యాంకులూ, ఆఖరకు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా వంటి అగ్రశేణి ప్రభుత్వ రంగ బ్యాంకులు కూడా దివాలా తీస్తాయి.

ఇది ఈ విలేకరి చెప్తున్న మాట కాదు. చేస్తున్న వూహ కాదు. ఇంగ్లాండ్ దేశానికి చెందిన ప్రముఖ బ్యాంక్ – క్రెడిట్ సూచీ ఇచ్చిన నివేదిక. విస్తారమైన సమాచారాన్ని సేకరించి, లోతైన పరిశీలన చేసి, నిశితమైన విశ్లేషణ తర్వాత వెలిబుచ్చిన అభిప్రాయం ఇది. వారు ఇచ్చిన నివేదికను ఏ ఆర్థికవేత్త కూడా తప్పు పట్టలేకున్నారు. రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, కేంద్ర ఆర్థికమంత్రిత్వ శాఖలు దొంగకు తేలు కుట్టిన చందంగా వూరకుండి పోతున్నాయి.

బ్యాంకుల అస్థిత్వాన్ని ప్రమాదంలోకి నెట్టిన ఆ పది కంపెనీలు ఇవీ...

- అదాని ఎంటర్‌ప్రైజెస్
- ఎస్సార్ గ్రూప్
- జిఎంఆర్ గ్రూప్
- జివికె గ్రూప్
- ల్యాంకో గ్రూప్
- జెపి గ్రూప్
- జిందాల్ గ్రూప్
- అనిల్ అంబానీ గ్రూప్
- వేదాంత గ్రూప్
- వీడియోకాన్ గ్రూప్

ఐదేళ్ల క్రితం అంటే 2007 ఆర్థిక సంవత్సరానికి ఈ పది కంపెనీలు చాలా చిన్న కార్పొరేట్ సంస్థలు. ఆనాడు ఆ పది మంది అప్పులు కేవలం 99వేల కోట్లు మాత్రమే. కానీ ఐదేళ్లు తిరిగేసరికి ఆ మొత్తం 6లక్షలా 50వేల కోట్ల రూపాయలు దాటింది. అంటే ఐదేళ్లలో ఏడు రెట్లు అప్పు చేశారన్నమాట. అందుకు వీరు చెప్పే కారణం – పెద్ద ఎత్తున కొత్త ప్రాజెక్ట్‌లు చేపట్టడం. సిమెంట్, థర్మల్ విద్యుత్, జల విద్యుత్, రోడ్లు, ఎయిర్ పోర్టులు, ఓడరేవుల వంటి మౌలిక సదుపాయాల రంగంలో పెట్టుబడుల కోసం ఇంతింత మొత్తాలు అప్పు చేశారు. ఒక పరిశ్రమ పెట్టడానికి, వ్యాపారం జరుపుకోవడానికి అప్పు చేయడం ఏ కంపెనీకైనా సహజం. కానీ ఆ ప్రాజెక్ట్ చేపట్టగల సామర్థ్యం ఆ కంపెనీకి వుండాలి. అందుకు ఎంత అవసరమో అంతే అప్పు చేయాలి. చేసిన అప్పును ఆ ప్రాజెక్ట్ అవసరం కోసమే వాడాలి. ఆ క్రమశిక్షణ పాటిస్తే, ఎంత అప్పు అయినా తిరిగి చెల్లించే స్థితిలో వుంటాయి కంపెనీలు.

అయితే భారత దేశంలోని ప్రైవేటు కార్పొరేట్ సంస్థల తీరు ఆ రకంగా లేదు. బ్యాంకులను దగా చేసి నిట్టనిలువునా ముంచి, ఆ సొమ్ముతో విలాసవంతమైన జీవితాలను గడపడానికి అలవాటు పడిపోయారు కార్పొరేట్ యజమానులు. స్వంత విమానాలు, హెలికాప్టర్లు కొనుక్కోవడం, భారీ భవంతులు నిర్మించుకోవడం, దుబాయి షేక్‌లతో సమానంగా విలాసవంతమైన పార్టీలు, విందులు వినోదాలలో మునిగి తేలడం, విదేశాలలో ఆస్తులు కూడ బెట్టుకోవడం వంటి దుర్మార్గాల కోసం బ్యాంక్ అప్పులను వాడుకొంటున్నారు.

### ల్యాంకో విద్యుత్ ప్రాజెక్ట్ అదృశ్యమై పోయింది

ఈ కంపెనీలు ప్రాజెక్ట్ పేరు మీద అప్పు తీసుకోవడానికి చూపే ఉత్సాహంలో నూటికి ఒక శాతం కూడా ఆ ప్రాజెక్ట్ కట్టడానికి చూపడం లేదు. ల్యాంకో కంపెనీ కేదార్‌నాథ్ దగ్గర ఒక విద్యుత్ ప్రాజెక్ట్ నిర్మించింది. మొన్న వచ్చిన ఉత్తరాఖండ్ వరదల్లో ఆ ప్రాజెక్ట్ అదృశ్యమై పోయింది. కనీసం అక్కడొక ప్రాజెక్ట్ వుండేదన్న ఆనవాళ్లు కూడా కన్పించడం లేదట. అక్కడి పరిస్థితి చూస్తే, వారు నిజంగా ప్రాజెక్ట్ కట్టారా లేక వరద సాకు చూపి కట్టిన ప్రాజెక్ట్ కొట్టుకపోయిందని బ్యాంకులకు మొండి చెయ్యి చూపుతున్నారా అన్న సందేహం కల్గుతున్నది. ఈ విద్యుత్ ప్రాజెక్ట్ మీద బ్యాంకులు కొన్ని వేల కోట్ల రూపాయల అప్పులు ఇచ్చాయి. ఆ అప్పులన్నిటినీ ఇప్పుడు రాని బాకీలుగా కొట్టి పారేయబోతున్నాయి.

ఒక ప్రాజెక్ట్‌కు అప్పు ఇవ్వాలంటే ఏ బ్యాంకు అయినా సమగ్రమైన అధ్యయనం చేస్తుంది. కేదార్‌నాథ్ వంటి కొండ ప్రాంతంలో విద్యుత్ ప్రాజెక్ట్‌కు అప్పు ఇచ్చే ముందు అది ఏ సెస్మిక్ జోన్ క్రిందకు వస్తుంది, ఆ జోన్ పరిస్థితులకు అనుగుణంగా అక్కడ ప్రాజెక్ట్ కట్టడం సాధ్యమా, అందుకు పర్యావరణ అనుమతులు వున్నాయా అన్న పరిశీలన చేయాలి. నిజంగా కేదార్‌నాథ్ ప్రాజెక్ట్‌కు అప్పు ఇచ్చే ముందు అటువంటి పరిశీలన చేసి వుంటే, ఇప్పుడిట్లా ప్రాజెక్ట్ అదృశ్యమయ్యే పరిస్థితి ఏర్పడి వుండేది కాదు.

### బొగ్గు లేకుండానే అప్పులు

థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్ నడపాలంటే బొగ్గు కావాలి. బొగ్గు సరఫరా ఒప్పందం (ఎఫ్ఎస్ఏ) వుంటేనే ఏ థర్మల్ కేంద్రం నిర్మాణమైనా ప్రారంభించాలి. పవర్ పర్చేజ్ అగ్రిమెంట్ వుంటేనే అది ఉత్పత్తి చేసే విద్యుత్ అమ్మకం వీలు కలుగుతుంది. కానీ విచిత్రంగా ఈ పది కంపెనీలు ప్రారంభించిన అసంఖ్యాక విద్యుత్ ప్రాజెక్ట్‌లకు ఫ్యూయల్ సప్లై ఒప్పందాలు లేవు. ఎఫ్ఎస్ఏ, పిపిఏలు లేకుండా బ్యాంకులు అప్పులు ఇచ్చిన ప్రాజెక్ట్‌లలో కొన్ని ఈ ప్రక్కనున్న పట్టికలో వున్నాయి చూడండి.

ఇట్లా చెప్పుకొంటూపోతే గత ఐదారేళ్లలో వివిధ కార్పొరేట్ కంపెనీలు ప్రారంభించిన విద్యుత్ ప్రాజెక్ట్‌లు కేవలం బ్యాంక్ అప్పుల కోసమే నిర్మిస్తున్నట్లుగా కన్పిస్తున్నది. ఒక్క విద్యుత్ ప్రాజెక్టుల కోసం భారతీయ బ్యాంకులు ఇచ్చిన దాదాపు 2లక్షల కోట్ల రూపాయల అప్పులు ఇక ఎప్పటికీ తిరిగి రానివిగా మారుతున్నట్లు రిజర్వు బ్యాంక్ నివేదికలు స్పష్టం చేస్తున్నాయి.

| కంపెనీ పేరు | ప్రాజెక్ట్ | బ్యాంకులు ఇచ్చిన అప్పు (రూ.కోట్లలో) |
|---|---|---|
| అదాని | ముంద్రా ఫేస్–4 | 7,000 |
| | టిరోడా | 7,400 |
| | కవాయి | 4,700 |
| | టిరోపా విస్తరణ | 5,000 |
| జయప్రకాష్ | బినా | 2.000 |
| | కర్చన–1 | 5.400 |
| | బరా–1 | 8,100 |
| కెఎస్‌కె | మహానంది | 6,000 |
| ల్యాంకో | ఉడిపి | 4,700 |
| | అన్పర | 4,700 |
| | అమర్‌కంటక్ | 2,600 |
| | విదర్భ | 5,500 |
| రిలయన్స్ | బుటిబొరి | 2,300 |
| | శాసన్ | 14,900 |
| | చిత్రాంగి | 15,400 |
| టాటా | ముంద్రా | 14,400 |
| జిందాల్ | రత్నగిరి | 4,700 |
| | విజయనగర్ | 2,000 |
| ఇండియాబుల్స్ | అమరావతి | 5300 |
| | నాసిక్ | 5,300 |
| ఎస్సార్ | సలయ | 3,600 |
| | మహన్ | 2,000 |
| జిఎంఆర్ | ఎమ్కో | 2,300 |

బొగ్గు సరఫరా ఒప్పందాలు లేకుండా, పవర్ పర్చేజ్ అగ్రిమెంట్లు లేకుండా, ఎన్విరాన్‌మెంట్ అనుమతులు లేకుండా, అటవీ చట్టాల మినహాయింపు లేకుండా ఇన్ని లక్షల కోట్ల రూపాయల విలువైన ప్రాజెక్ట్‌ల నిర్మాణానికి బ్యాంకులు ఎందుకు అప్పులిచ్చాయి. ఇప్పుడెందుకు దివాలా స్థితికి చేరుకొంటున్నాయి.

హిమాచల్‌ప్రదేశ్‌లో ఒక జల విద్యుత్ ప్రాజెక్ట్ నిర్మాణం గత 22ఏళ్లుగా నడుస్తున్నది. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అవినీతి ఖాతాలలో ఒకటిగా పేరుపడిన అథేనా అనే కంపెనీ హిమాలయాలలో నిర్మిస్తున్న విద్యుత్ ప్రాజెక్ట్ ఆ మధ్య వచ్చిన భూకంపంలో కుప్పకూలి పోయింది. ఉత్తరాఖండ్‌లో జివికె నిర్మించిన జలవిద్యుత్ ప్రాజెక్ట్ మొన్నటి వరదలకు పూడిపోయింది. వేల కోట్ల బ్యాంకు అప్పుల స్వాహా తర్వాత ఎందుకూ పనికి రాకుండా పోయిన విద్యుత్ ప్రాజెక్ట్‌ల జాబితా చూస్తే కడుపు రగులకపోతుంది.

### ఈ కంపెనీల రాబడి వడ్డీకి కూడా చాలడం లేదు

కంపెనీలు బ్యాంకుల నుంచి తీసుకొన్న అప్పులకు కనీసం వడ్డీ చెల్లించే స్థితిలో వుండాలంటే, వారి ఇంటరెస్ట్ కవరేజ్ రేషియో 1.5 కంటే అధికంగా వుండాలన్నది బ్యాంకింగ్ సూత్రం. కానీ పైన

కొరవ 14వ పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com